# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక

సంపాదకుడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౨౨ ] అక్టోబరు 1949 [సంచిక ౧౦




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైనను ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒక్కేపక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

## అక్టోబరు 1 తేదీన విడుదలయింది




డిస్ట్రిబ్యూటర్లు:

ఆంధ్ర, దత్తమండలములు, నైజామునకు:— పూర్ణాపిక్చర్స్, విజయవాడ.

మైసూరు — ప్రభా పిక్చర్స్, బెంగుళూరు సిటీ.

దక్షిణ దేశమునకు:— జూపిటర్ పిక్చర్స్ సర్క్యూట్, మద్రాసు.

# విషయసూచిక






జయజయ గృహలక్ష్మి సఖి  జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయ కల్యాణీ !

---

# స్త్రీలకు సైనిక శిక్షణ అనవసరమా?

శ్రీ కరియప్పగారు స్వతంత్ర భారతదేశమున ప్రథమ సర్వసేనానిగా నియమింపబడ్డ అదృష్టవంతులు. అయితే ఆయన ఈ మాసారంభమున అమృతసరములో ఉపన్యసిస్తూ, స్త్రీలకుకూడా సైనిక శిక్షణ కావాలన్న కోరికనుగూర్చి ఇట్లా అన్నారు :-

“దేశం రక్షించడానికి చాలినంతమంది మగవాళ్లున్నారు; భారత నారీమణులు మంచి భార్యలు, మంచి తల్లులు కావడానికి తంటాలు పడాలి.”

ఈ అభిప్రాయముతో మేము సుతరాము ఏకీభవించము; ఏ ఆంధ్ర నారీమణియు, ఏ భారత మహిళామణియు అంగీకరింపజాలదు.

“గృహలక్ష్మి”—భారతీయ స్త్రీలు సదా “గృహలక్ష్ములై” మెరయవలెననే కోరుతుంటుంది. అయితే ఆమెకు పురుషులతోపాటు మరే కార్యవిధానమున్నా చేబట్టడానికి నిషేధము, న్యూనత ఉండరాదని దృఢంగా కోరుతుంది. ఇతర అన్ని వృత్తులుచేబట్టే పురుషులు సైనిక వృత్తికి ఎట్లాగైతే లాయఖో అట్లాగే స్త్రీకూడా లాయఖే అని మా నిశ్చితాభిప్రాయం.

దేవతా మూర్తులను విడుద్దాము. పౌరాణిక యుగం ఆలోచించండి. సీత—శివ్రని విల్లును, ఆటల మధ్య, తన చేబంతి దాని క్రింద దూరినదని, ఎడమచేతితో తీసి అవతల పెట్టిందట; అంతకెన్ని సంవత్సరాల ముందు, దాన్ని ఎందరెత్తి కదిలించారో?—అప్పుడు, జనకుడు, ఈ విల్లు నెక్కుబెట్టిన పురుషునికిగాని ఈ పిల్ల నివ్వనన్నాడు. కైక యుద్ధంలో-

దశరథుని రథం నడిపింది. సత్యభామ నరకాసుని వధకై భర్తతో దప్పడ్డది; ప్రత్యక్షంగా నరకునితో యుద్ధమే చేసింది. అర్జునుడు తన్ను పెళ్లాడి ఇంద్రప్రస్థానికి గొనిపోయే టప్పుడు అడ్డపడ్డ యాదవ సైనికులతో అతడు పోరుతుండగా సుభద్ర చాకచక్యంగా రథం తోలుకొని వెళ్లింది. భీష్ముడు-పరశు రామునితో యుద్ధంచేసేటప్పుడు-అతని రథసారథి చావగా గంగ, కొడుకు రథం నడిపింది. ఇంకెందరో ఇట్టి వారు.

చారిత్రక యుగంలోకి వత్తాము. రాణీ సంయుక్త, చాంద్‌బీబి, దుర్గాదేవి, నాయకురాలు, రుద్రమదేవి, ఝూన్సీ లక్ష్మీబాయి - ఇత్యాదు లెందరో — సైన్యాలు నడిపారు; యుద్ధాలుచేశారు; జయించారు కూడా. కోటప్పకొండమీద చెన్నకరెడ్డి అప్ప - చీర విరిచి కట్టి గండ్రగొడ్డలి చేపట్టి - చెంగలించి దూకి - సాయుధులైన పోలీసులను తెలిగి, చెండాడింది. నేతాజీ సైన్యంలో కల్నల్ లక్ష్మి - తానుపయోగింపజాలని ఆధుని కాయుధంలేదని తన్ను బందీగా గొన్న ఆంగ్లేయులతో నిర్భయంగా చెప్పివేసింది. అవకాశ మొదవినంతనే భారత నారీమణులంతంతలేసి శౌర్యసాహసాలు చూపించ గలుగగా "స్త్రీలు భార్యలు, తల్లులు అయితే చాలు; మేము మగవాళ్ళము దేశాన్ని రక్షిస్తాములే" అని అర్థమొచ్చేట్లు కరియప్పగారనడం—అదీ భారత స్వతంత్ర ప్రభుత్వపు ప్రథమ సైన్యాధ్యక్షులు కరియప్పగారనడం, ఎంత మాత్రం అంగీకారయోగ్యం కాదు.

చిరకాల సైనికులైన జనరల్ కరియప్పగారు పురుషుల మగసిరిపై అంతటి అభిమానం, విశ్వాసం కలిగియుండడం మెచ్చదగినదేగాని 1857లో బాలరావు ఝూన్సీ లక్ష్మీబాయికి సర్వసైనాధ్యక్ష పదవి నప్పచెప్పడం తన మగసిరికిలోటని తలంచడమే - ఆ పోరాటంలో భారతీయ సైన్యాలోడిపోవడానికి ప్రబల కారణమైంది — అని నాటి యూరోపియనులే స్పష్టంగా వ్రాశారనే విషయం కూడా ఆయన గమనించాలి.

నాటికి, నేటికి యుద్ధ విధానమే మారింది. నేడు పశుబలం కన్నా బుద్ధిబలమే యుద్ధాలు నడపడానికి హెచ్చుగా కావలసినదని - ఆ రహస్య మెరింగిన వారంటారు. ఆ బుద్ధిబలం - పురుషుల పాటి స్త్రీలకు లేకపోలేదని విశ్వవిద్యాలయాలే చాటుతున్నవి.

జనాభాలో సగం మందిని, ఇల్లు వాకిలి సర్దుకొని, పిల్లల కని పెంచే అబలలుగానే యుంచి, దేశస్వాతంత్ర్యంతోపాటు వీళ్ళనుకూడా మగవాళ్ళమే రక్షిస్తామనుకోవడం శ్రీ కరియప్పగారివంటి ఉత్తమ సైన్యాధ్యక్షునికికూడా, తలకుమించిన భారం; అనాలోచితమైన మాట; ఆధార రహితమైన ఊహ.

ఇంతకూ సైనికుడు పోటరి; మాటకారి కాడు; కారాదు. ఆ మాట్లాడడంకూడా తటస్థించినప్పు డిలాంటి వ్యత్యస్తం - జరుగుతుంటుంది, మరి.

# భగవాన్ వేంకటరమణ మహర్షి సందర్శనము

(జిజ్ఞాసువు)

కొంతకాలంగా జరిగిపడని సంగతు లనేకంచేత - మనస్సు కల్లోలతరంగితమై - బహు చీకాకుగా ఉంటూన్నది. తలవని తలంపుగా దూరస్థుడైయున్న ఆప్తుడు మహార్నవమినాటిరాత్రి నాదరికివచ్చి - "రేపు భగవాన్ శ్రీ వేంకటరమణుని సేవించుకుందాము వస్తావా" అన్నాడు. ఆ ఆప్తవాక్యం - నాకు గాలిలో దూలిపోయే వ్యక్తికాలంబనం దొరికినట్లైనది. 'తయార్' అన్నాను.

మర్నాడు ప్రొద్దున 10-11 గం॥లమధ్య శ్రీ వేంకటరమణుని నిలయం చేరి, సింహద్వారంలో అడుగు పెట్టే సరికి శరత్కాలంలో-ఇది శరత్కాలమేకదూ - నిండు తామరకొలను దరి చేరినట్లనిపించింది. హాలులో భగవానుడు వేంచేసి ఉన్నాడని విన్నాము. మిత్రునివెంట హాలులో ప్రవేశించాను. అలౌకిక తేజోమూర్తియై వెలుగుతూఉన్న-వేంకటరమణునికి సాష్టాంగనమస్కారములొనర్చి మేమిరువురము చేతులుజోడించి నిలుచున్నాము. నా నేస్తము "ఫలానా, ఫలానా" అని నన్ను పరిచయంచేయగా భగవానుడు 'జ్ఞానాను' అని స్మృతిపథమున ఉన్నట్లుగా సూచించాడు. పులకిత గాత్రముతో ఓరగా చూచున్నాను - ఏమని వర్ణింతును ఆ పరమ శాంతి నిలయాన్ని ?

'పరమపురుషునింటఁ బాదముంచిన మాత్ర
నాత్మ యెంత శాంతమయ్యె నహహా !
జాగిలంబులట్లు చొకళించెడు వగల్
కలయు బోలె నిచట దొలిగిపోయె !"

అని సంభ్రమంచెందుతూ చూచున్నాను. అప్పటికే చాలమంది స్త్రీపురుషులు - అన్నితరగతులవారు అనేకవృత్తులవారు, చిత్తవృత్తులవారు, భిన్నభిన్నవయస్సులవారు-ఎందరెందరోవచ్చి - భగవానునికి మ్రొక్కి హాలులో ఆసీనులైయున్నారు. ఇంకెందరోవచ్చి భగవానునికి సాష్టాంగనమస్కారమొనర్చి, తమ తమ పూర్వపుణ్యపరిపాకముకొలది - ఒకచూపు, ఒకమాట, ఒకహెచ్చరిక, ఒక్క ఆర్ద్రవాక్యము, ఒక్క చిరునవ్వు - మాత్రముతో

"భక్త్యైవ పన్నేషుహి తద్విధానాం
ప్రసాదచిహ్నాని పురఃఫలాని."

అని మహాతృప్తులై - ఒకవంకచేరి భగవానుని ధ్యానించుచు కూర్చుంటున్నారు.

నేనున్నూ, నాకొలది నెరుంగక, చాపల్యమున - శాంతినిలయమైయున్న భగవానుని ముఖారవిందము నందే మనోభృంగమును బందీకృతనొనర్చి తదేకధ్యానంతో కూర్చున్నాను. నా వగలన్నియు తత్కాలము కైన - తొలిగి తేలికయైన హృదయాన్ని పదిలమొనర్చుకొగలిగానేమోగాని మనోభృంగము మాత్రము మాటిమాటికి అటునిటు ఎగిరిపోజొచ్చినది; అయితే భగవానుని ముఖారవిందమున ఏమిదివ్యామృతమును రుచిగొన్నదో తిరిగి తిరిగి - అందే ఆశ్రయింపజొచ్చినది. కాదు. కాదు; భగవానుడే తన కృపాకటాక్ష వీక్షణములచే నా తుంటరి కీటకమును అదలించి ఆకర్షించుచున్నాడేమో !

భగవానుని కుడిచేతివైపున మాతృభూతేశ్వరాలయము; గర్భగుడి. ముందు ఆవరణమున - నవరాత్రములకై ప్రత్యేకముగా దేవికి విమానము నిర్మించి - ప్రతిష్ఠించి అలంకరించినారు. అందు, అందు విజయ దశమినాడు పూజజరుగుచున్నది. పూజజరిగినంతకాలము భగవానుని దృష్టి అక్లే వాలియున్నది. పూజానంతరము - ద్వారములు తెరిచారా. అంత నవటివారు గొంతెత్తి మంత్రపుష్పమును పఠింప నారంభించినారు. భగవానుడు - [redacted] నాదమున లీనమగుచున్నాడు.

'ఓం తద్బ్రహ్మా, ఓం తద్వాయుః, ఓం తదాత్మా,
ఓం తత్సత్యం, ఓం తత్సర్వం, ఓం తత్పురోం నమః
అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు,
త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మిన్ద్రస్త్వగ్ం రుద్ర
స్త్వం విష్ణుస్త్వం బ్రహ్మాత్వం ప్రజాపతిః."

అన్న భాగము - 'ఖణీల్, ఖణీల్ 'మని వినపడుతున్నది. భగవానుని ముఖబింబము మారినది. అంతవరకున్న నైజతేజోమూర్తి కాదు. ఉజ్వలితమై, అట్టి దిట్టి దనరాని అతీత తేజోరాసియై, ప్రభాపటలమై మెరయజొచ్చినది. "తత్సత్య"మును, "తత్సర్వ"మును ప్రత్యక్షముగా గాంచుచున్నామా? భగవానుడా శబ్దబ్రహ్మముతో తాదాత్మ్యము నందినాడా? అనిపించినది.

మంత్రపుష్పము ముగిసినది. కర్పూరహారతి గొనివచ్చినారు. అందరము కనులకద్దుకున్నాము. భగవానుడు మామూలు మూర్తిదాల్చినాడు. గుడిలోనికిపోయి ఉభయమూర్తులను దర్శించి ప్రసాదమును స్వీకరించితిమి. విశ్రాంతిగొని తిరిగీ సాయంకాలము భగవానునికి మ్రొక్కి, శలవుతీసుకొని రాత్రికి ఇంటికి చేరినాము.

అయితే - ఏమి అడిగి, ఏమిక్రొత్తది తెలుసుకొన్నావని అంటారేమో! ఏమి అడగవలె? ఏమి తెలుసుకోవలె? భగవానునివంటి సిద్ధపురుషుల ఆశ్రయము - అడిగి తెలుసుకొనుటకు గాదు; అనుగ్రహమున పొందు అనుభూతికొరకు; దివ్యానుభూతికొరకు. అప్రచోదితమై ఈజీవి భగవానుని సన్నిధానము చవిగొన్నది. [redacted] మహావిభూతి నాశ్రయించినది. అయితే అశిక్షితమైన ఆటకోతివలె అటు ఇటు పరుగులెత్తడం - ఈ చిత్తవృత్తికి నైజలక్షణము. కాని ఆటలమరిగి జారిపోవుశిశువును లాలించి చేరదీసుకోవడం తల్లిపని. తల్లి చేరువగా శిశువు ఉండడమే కావలసినది - పిదప, భగవాన్ కృప! భగవాన్ కృప!!

"అథ, భగవాన్, లోకానుగ్రహాయ కుశలీ కాశ్యపః?"

అని దుష్యంతుడు శకుంతల వెంటవచ్చిన కణ్వశిష్యులను ప్రశ్నిస్తాడు. అవును - లోకానుగ్రహార్థమే. ముక్తసంగులు, జీవన్ముక్తులునైన - ఇట్టి మహర్షులు - కొంతకాలం దేహధారణం సహిస్తారు!

# రమణః

శ్రీమతి పొణకా కనకమ్మగారు



కైవల్య శబ్దమ్ము కేవలమ్మును మూర్తి
మంతమై విలసిల్ల మౌన బోధ
నిర్వాణ నామమ్ము నిరవధి కప్రభా
జ్యోతియై భాసిల్ల శుద్ధ బోధ
ప్రజ్ఞాన తేజమ్ము భవబంధ మోహాని
ర్మూలమై రాజిల్ల మూలబోధ
పరమార్థ తత్వమ్ము బ్రహ్మ స్వరూపమై
సాక్షియై శోభిల్ల జ్ఞాన బోధ
సచ్చిదానంద నిశ్శ్రేయసమ్ము శుద్ధ
బుద్ధ ముక్తమై యలరార పూర్ణబోధ
తను మనమ్ము కనుల కందని విధాన
రమణు (శ్రీ) చిన్మయావతారము వెలుంగ.

అదియొక విశ్వరూపము మహామహిమమ్మూర్తి లోకసుందర
మ్మది, పరిపూర్ణమై విమలమై విభవాతిశయమ్మునై మొదల్
తుదినెఱుగంగ రాక పరిధుల్ వివరింపగాక ముక్తికిన్
గుదురయి చల్లనై హృదయగోచరమై ప్రభనిండి వెల్గెడిన్.

కన్నులు మూసి తారక ముఖమ్మయి చిత్తము నంజలించి లో
గన్నులు విప్పి హృద్విమల కంజ సుఖాంతర భద్రపీఠిపై
కన్నుల నిండ నప్పరమగమ్యు పరాత్పరు నప్రమేయునిన్
కన్నుల వెల్గు శ్రీరమణు కన్నులగొల్చి ప్రపత్తి చేసెదన్.

నీ చిరునవ్వు వెన్నెలల చల్లని బిందు వనురక్తి నానిన నాత్మపదము
నీ సుప్రసన్నమౌ నెమ్మోము నందమ్ము ముచ్చట జూచిన ముక్తిపదము
నీ నునుపల్కు తేనియల తీయని తేట చవు లూరగ్రోలిన జ్ఞానపదము
నీ యోరగన్నుల నెనరుచిల్కెడు చూపు సూటిగా నందిన శుద్ధపదము

నీ కృపా పయోధి నిండార నోలాడి చిత్తసీమ జేర శివ పదమ్ము
అంతరంగ గుహాను హాయిగా విహరించి భక్తి చేరిగొలువ పరమ పదము.

దీపహారతినీయ దేవదేవుడు స్వయంజ్యోతిర్మయై తా జగజ్జ్యోతి చూపు
అగరు ధూపము లీయ ఆత్మప్రకాశుడై చిత్తవాసనమ్ములు చెదరగొట్టు
మధుర భిక్షల నీయ మహిత కృపాత్ముండు ఆత్మభిక్షలు తనియంగ బెట్టు
కానుకలేమో ఈయ కల్యాణ శుభమూర్తి విశ్వవిభూతితో వేడ్కసేయు

ఏమి పూజల స్వామి సేవింప నేర్తు మేమి చేసిన నదియతానై వెలంగు
స్వాత్మ పుష్పమ్ము మంత్రపుష్పముగ చేసి దోయిలించెద మురక చేతో ముదాప్తి.

మాటలే లేని కేవల మౌనపూజ లోకమంతయు ప్రభుకడ మోకరిల్ల
సన్నుతులు సేయనూరక జతనమేల కనుల దర్శించి కైవల్యగతులు గొందు!

---



రష్యా యువతులు పారచూటుల నుపయోగించటం నేరుస్తున్నారు.

నూతన గుంటూరు జిల్లాబోర్డున కాంగ్రెసుపార్టీ సభ్యురాలు

# కవయిత్రి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమగారు

19-9-49 వ తేదిన జరిగిన జిల్లాబోర్డు యెన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థినిగా నిలచి అఖండవిజయము గాంచిన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి నభినందించుటకు శ్రీహితైషిణీ మండలి సభ్యురాండ్రు దేశిరాజు భారతీదేవి యధ్యక్షతను సమావేశమైరి. ప్రథమమున శ్రీ వరలక్ష్మమ్మగారి గౌరవార్థ మల్పాహారవిందు గావింపబడెను. తదుపరి సభలో నధ్యక్షురాలు యభినందన పద్యములుచదివి వారికి సమర్పించెను. మండలి యధ్యక్షురాలగు యిమ్మానేని లీలాదేవి, ఉపాధ్యక్షురాలగు తోటకూరి లక్ష్మీకాంతమ్మ, సహాయ కార్యదర్శినులలో నొకరగు చంద్రమౌళికాంతవతమ్మగార్లు వరలక్ష్మమ్మగారి సేవానిరతిని శ్లాఘించుచు, ఆమె విజయమునకు సంతసమును వెలిబుచ్చుచు, ఆమె కర్తవ్యమును సూచించుచు నుపన్యసించిరి. వీరికి వరలక్ష్మమ్మగారు సమాధానము చెప్పుచు కాంగ్రెస్ సంస్థలో ప్రస్తుతమేర్పడ్డ భేదాభిప్రాయములు, బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్య, తన్నివారణ మార్గములు, మొదలైన యనేక విషయాలను విపులముగా నుపన్యసించి మండలివారి యభినందనములకు కృతజ్ఞతను తెలియజేసిరి. జిల్లాబోర్డు యెన్నికలలో కమ్యూనిష్టు అభ్యర్థిని బసవ పున్నమ్మగారికి 2119 వోట్లునూ, స్వతంత్ర అభ్యర్థిని శాంతాదేవిగారికి 1925 వోట్లునూ, కాంగ్రెస్ అభ్యర్థిని వరలక్ష్మమ్మగారికి 6453 వోట్లును వచ్చినవి.

ఇంత మెజారిటీతో విజయము బొందిన శ్రీమతి వరలక్ష్మమ్మగారి విజయము వ్యక్తిగతముగా నామెకేగాక మహిళా సంఘానికిని, కాంగ్రెస్ సంస్థకునుగూడ నత్యంతగర్వ కారణమే.

## అభినందన



పాలపర్తియు కనుపర్తి వంశములకు
దీపకళికా ప్రకాశమై, తేజరిల్లు
నట్టినతి వరలక్ష్మమ్మ, నరయుగాత
యాయురారోగ్యములొసంగి, యచ్యుతుండు.

చదువునుగల్గి,సద్గుణము చాలగగల్గి, ప్రశస్తశీల సం
పద కొదలేక గల్గి, యనవద్యయశంబును గల్గి, యాంధ్రభూ
సదసుల గౌరవంబుగని, చక్కని గ్రంథములన్ రచించు నీ
సదమల చిత్తయోగ్యతకు సభ్యత మండలిబోర్డునం దగుః.

వనిత లజ్జానాంధ వనధిలోపల మున్గి గొట్టుముట్టాడెడు నట్టినాడె,
చెలులకు విద్దియ చేటు దెచ్చునటంచు పలువురు పలుగతుల్ వదరునాడె,
చదువుచునున్నట్టి, సుదతుల గనుచోట నేవంపుదృష్టి నీక్షించునాడె,
చెనటి పూర్వాచార శృంఖలా బంధనల్ ముప్పిరిగొని పీడిరోనినాడె,

బహుళ కష్టాలకోర్చి యభంగశ్రద్ధ విద్యగడియించి సదసద్వివేకమంది
నట్టి కనువర్తి వరలక్ష్మియమ్మగారు విదుషి యయ్యెను మానినుల్ ముదమునంద.

గేయమగు రచనలచేత కేసరీ సువర్ణకంకణ ధారణ బడసెనయున్న;
మాండలికబోర్డు సభ్యత్వమాన్యయయ్యె బహుళ సంఖ్యాకపద్ధతు ల్వ్రాసె నేడు.

భావితధర్మ నిర్వహణ పద్ధతి సభ్యులకెల్ల నూదుచున్ ప్రజా
సేవ యొనర్చి, సంతతము స్త్రీలకళాలయవృత్తు లేర్పడం
గా వసరైన సాధనలగైకొన మండలిబోర్డునూది సం
భావన బొందుమమ్మ ప్రతిభామతి నో వరలక్ష్మి ధీమణీ.

మహితగాంధిజి యాశీస్సు మహిమజేసి భవ్యతరమైన జయము సంభావ్యమయ్యె
సతుల క్షేమాభివృద్ధికై సతతమీవు కృషిని సల్పంగ తరుణంబు గూడివచ్చె.



గత యుద్ధకాలంలో జపాను యువతులు సైనికవిద్య నేరుస్తున్నదృశ్యం.



"మనజాతిపిత మహాత్మా గాంధీకంటే అహింసాయోగి, శాంతి సామ్రాట్ మరెవ్వరున్నారు? ఆయనను మనం కోల్పోయినాము. అయితే, వీగిపోవడంకన్నా, తబ్బిబ్బై పారిపోవడంకన్నా, కత్తిపట్టడమే శ్రేయస్కరమని ఆయన అన్నాడు."

నెహ్రూ ప్రధాని 6-10-49




(గత సంచిక తరువాయి)

వచనం॥

అని చెప్పి బ్రాహ్మణుండు ద్వారకా
నగరమునకు బోయి తాను వచ్చిన సంగతిని
శ్రీ కృష్ణమూర్తి వారికి ద్వారపాలురచే
దెలియ జేయించి,

వేడుకగా దా మేడలోని కరిగి ॥తం॥

బంగరు సింహాసనమున గూర్చున్న
పరమాత్ముండగు శ్రీకృష్ణుని వీక్షించి
తా వచ్చిన పనికై తగిన రీతిగాను
పెండ్లి కొడుకువు గమ్మని దీవించె ;
విలాస మునకై శరీర ధరుడైన
భగవంతునకు దెలియని దేముండు ?

బ్రాహ్మణు డెప్పటి నుండి చేరనో గ్రహ
తెలిసి యాశీర్వచనము లందికొని ;
దిగ్గున గద్దియ దిగి యా భూసురుని
ఉచిత పీఠమున గూర్చుండగ జేసి
ఉచిత రీతిగా మర్యాదలు సలిపి

మిశ్రం॥

శిశుపాలుని హస్తంబుల రుక్మిణి
చక్కగ గా పాడగబడుచుండె సుమా
యను తీరున లోకంబుల రక్షింపను
దీక్షను గలిగిన యే హస్తం బై తేగలదో
నా హస్తములో బ్రాహ్మణ ప్రవరుని
పాదంబుల దా మెత్తగ నొత్తుచు
మృదు మధురంబున బలుకరించుచుండె॥తం॥

ఏ దేశము మీ రాజెవ్వరు దేవా!
ఎట్లీ సముద్ర మందలి ద్వారకకు
చేర గలిగితివి కోరిక ఏమయ్యా!
మారు వచింపక నీ కోరిక దీర్తు
నవ్వుల కాడే మాటలు కావయ్యా!
నమ్ముము వాగ్దానమ్ము జేయుచుంటి.
వాసు దేవుడీ తీరున బలుకంగా
భూసురు డంతట విన్నవించు చుండె;
విదర్భ దేశాధీశుడు భీష్మకుడు
విమల గుణవతి యగునతని సుత
భక్తురాలు దా రుక్మిణి యను కన్య
ముక్తి కోఱకు మీ సేవజేయ గాను.
ఆత్మార్పణమును జేయుచు నాకన్య
అతి శుభంబగు వర్తమాన మంపె
వినుమా! రుక్మిణి విన్నపమును దేవా!
"మంగళ రూపా నీ మహాత్మ్య మెంచగ
మునీంద్రులకే యసాధ్యంబు దేవా!
నిను సేవించెడి వారల కెంతయును
నిరత సౌఖ్యమగు నున్నత పదవి గదా!
నామస్మరణము సలుపు మాత్రమునను
నశించు నాసంసార బంధములు.
సిగ్గును విడిచి చెప్పుచుంటి దేవా!
చిత్తము నీపై హత్తి కొనియె దేవా!
ప్రార్థన గైకొని పాలించుము దేవా!
భక్తురాల నను గాపాడుము దేవా!
లోక మనోభి రాముండవు దేవా!
లోకములో గుణ సంపన్నులు గలరు;
గంభీరులు మెట్టెట్టి వారో గలరు;
గడసరు లగు వారెందరో ఉన్నారు;
అట్టి వారి హృదయంబుల గొనియెదవు.

అనిశము రంజింపగ జేసెదవు.
సకల సుగుణ సంపన్నుడ వీవయ్యా!
సర్వము నీవై ప్రకాశించు మూర్తీ!
నిన్ను గోరని వార లెవరు గలరు?
కన్నె ప్రాయపు యబలను నే నెంత?
ముద్దరాల నాబుద్ధి పరిమి తెంత?
రమా దేవియే మున్ను నిన్ను గోరి
భ్రమించి నినునే గోర వింతయగునా?
పురుష శ్రేష్ఠ! నీ పదార్థ మగు నన్ను
దురితాత్ముడు శిశుపాలుడు గర్వమున
కొని పోవగ సిద్ధంబుగ నున్నాడు
నిను విష్ణుండని యెరుగండా జడుడు

వచనం|| మఱియు,

పూర్వ జన్మమున బరమాత్ముని ప్రీతిగను
పూజలు వ్రతములు చేసియుంటి నేని

మిశ్రం||

దేవ బ్రాహ్మణ బుధారాధనయు
దానధర్మములు చేసితి నేని
భర్తగాడె వసుదేవనందనుండగు
శ్రీకృష్ణుండు ||తం||



అష్ట వసువుల దేవ వర్గములను
ఇష్టు డగుచు సంతోషము గూర్చునుగా
దుష్ట రాక్షసుల దునుమాడెడు వాడు
దుష్టులైన శిశుపాలాదులను
జయించి నన్ను జేకొని బ్రోవండే?
జగదీశుడు నను గను గొని బ్రోవండే?

వచనం॥ మఱియు,

పురుషోత్తమ! నను జేకొని పోవుటకు
విరసము దెలుపక వెంట వచ్చు దాన
చతురంగ బలంబుల తోడను చనుదెంచి
పతనుల జేయుము శిశు పాలాదులను
జయించ వలెగా రేపే వారలను
జయించు టకు నీ బలము వలయు దేవా!
కన్యా శుల్కము గా నీ బల మొసగి
నన్ను రాక్షస వివాహ విధమునను
చేకొని పొమ్ము వెంటన వచ్చెదను
చెప్పను, యుద్ధము, జెప్పను శ్రీకృష్ణా!
అంతః పురమున నున్న దాన నను చు
ఆటంకము గలిగించు బంధువులను
చంపుచు నన్ను గైకొని పోవుటకు
శంకింపకు నీ కుపాయ మెరిగింతు.
పెండ్లికి పూర్వము దేవాలయ మునకు
పెండ్లి కూతు మావారలు బంపెదరు
కోరి నేను దుర్గాలయమును జేర
ఊరి వెలుపటకు వచ్చెడి సమయమున
కొని పోయిన యే కొదవ గలుగ దయ్యా!
ప్రాణేశా! నీ ప్రేమ జూపకున్న
ప్రాణంబులు విడనాడు దాన నిజము
నూరు జన్మముల కైనను నిన్నేగా
కోరికతో ధ్యానించు చుండు దాన.
నిశ్చలంబుగా నిను బూజింతునుగా!
నిశ్చయముగ నీ నియమము వీడనుగా!"

వచనం॥

ఈ విధముగా రుక్మిణీదేవి పంపిన రాయ బార మంతయు బ్రాహ్మణుండు తెల్పగా శ్రీకృష్ణుండు విని వివాహ మాడుట కంగీకరించితిని సుమా యనే టటుల తన చేతితో బ్రాహ్మణుని చేయిబట్టి యిట్లు చెప్ప బూనెను.

భూసురోత్తమా! కన్య రుక్మిణీపై
భాసురమగు యనురాగము గల వాడ;
కూరుకు రాదొక రేయిమైన నాకు
కుందుచు నుంటిని యాహారము వీడి
నెమలి పింఛమును తలను దాల్చ లేదు
భ్రమసి మురళి ప్రయోగించి యుండ లేదు
దిన మొక యేడుగ గడుపు చుంటి నయ్యా!
అనయము మదిలో దలచు చుందు నయ్యా!
పెండ్లి కొడుకు మా రుక్మి బావ గారు
వెఱ్ఱి యూహ దలపోయుచు నున్నారు.
సహింప డతడని మున్నె యెఱుగుదును
శాత్రవు లందరి జయించి తీరెదను
రుక్మిణీని గొని వచ్చెద నిక్కముగా
రుక్మి బావకు వెఱచు వాడ గాను
ప్రయాణమ్మును నేడే గావింతు
బయలు దేరుమా బ్రాహ్మణోత్తముండా!



వచనం॥

అని చెప్పగా బ్రాహ్మణుండు మహానందమును బొంది శ్రీకృష్ణుని రథంబెక్కి శ్రీకృష్ణునితో కుండిననగరమునకు బ్రయాణ మయ్యెను. (సశేషం)

## స త్య భా మ

ఈసునబుట్టి డెందమున హెచ్చిన కోపదవానలంబుచే
గా సిలియేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుట న్లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ జీరచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయ కంఠకల కంఠవధూకలకాకలిధ్వనిన్.



## కృ ష్ణు డు

వామలోచన! నీకేళివనములోన
జలువ నీడచల్లు చెంగల్వకొలని కెలన
సరసకర్పూరకదళికాతతుల నడుమఁ
బెరటి చెట్టుగ నాటింతుఁ బెంపు గనుము.

(చిత్రం : బొమ్మకంటి లలితాదేవిగారు) (పద్యాలు : ముక్కు తిమ్మన పారిజాతాపహరణం)

# టొమాటోలు:

టొమాటోలు మనదేశానికి క్రొత్తవి, బంగాళా దుంపల వలెనే. బంగాళాదుంపలు తొలుత ఐర్లండులో కాబోలు - బంజరు భూములలో వాటంతటవి పండి మొలిచేవట. తినడానికి పనికి వస్తాయేమోనని - పచ్చివాటిని చూచారట. చిరుచేదుగా ఉండడంచేత 'ఛూ' అని ఉమ్మేశారట. చిరకాలం అట్లాగే ఉండిపోయాయి. భూమిలో విత్తనం భూమిలోనే ఉండిపోయి వర్షం కురిశాక తిరిగి పుట్టి పెరిగేవి. కొన్ని సంవత్సరాలకు ఒక ప్రబుద్ధుడు - కాల్చి తింటే ఎట్లా ఉంటాయో అని - చిదుగులమంటలో తంపలేసి - తినిచూచాడు. మాకమ్మగా ఉన్నది. ఆ వార్త పాకిపోయింది. వారినిచూచి వారు, వారినిచూచి వారు తిననారంభించారు. దేశదేశాలకు పాకాయి. మనదేశానికి వచ్చాయి. మొదట బంగాళాదేశం రావడంచేత బంగాళాదుంప లన్నారు. కొంతకాలానికి కూనూరు ప్రాంతంలో పైరైనాయి. గుండ్రంగా ఉండడంచే ఉర్లగడ్డలన్నారు. చిరకాలం వీటిని ఛాందసులు ముట్టుకొనే వారుకారు. ఇటీవల పుచ్చుకుంటున్నారు. కొందరు, కాని - తద్దినాలకు, కర్మాంతరాలకుమాత్రం వీనినింకా ఉపయోగించడం లేదు పలువురు.

టొమాటోలు, అట్లాగే పచ్చివి కొంచం చిరుచేదుగా ఉంటాయి. కాబట్టి వీనినికూడా తిన యోగ్యమైనవి కావని మొదట్లో అనుకున్నారు. రాను రాను అలవాటు పడ్డారు. ఎర్రగా పండిన పండ్లు - బుట్టలో ఉన్నా, అంగట్లో కుప్పబోసినా - మాడనందంగా ఉంటాయి.

పచ్చివానికంటె పండిన పండ్లు శ్రేష్ఠమైనవి. రుచికరమైనవి. విటమిన్‌లు అనే ప్రాణశక్తులు ఆహార పదార్థాలలో ఉంటాయని - అవి ప్రాణులకు అవసరమని, - కొంతకాలం క్రిందట శాస్త్రజ్ఞులు కనుగొన్నట్లు పలుమారు తెలుపబడినది. వానిలో విటమిన్ 'సి' ఒకటి.

2 పౌ॥ ల (80 తు॥ లు) టొమాటోలలో - ఉండే వివిధమైన పదార్థాలను గమనించండి.-



| | | |
|---|---|---|
| ఆహారశక్తి | 173 | కాలొరీలు. |
| ప్రొటీన్ | 7. 9 | గ్రాములు. |
| క్రొవ్వుపదార్థం | 1.6 | ,, |
| కార్బొహైడ్రేట్‌లు | 31.8 | ,, |
| కాల్షియం | 48 | మిల్లిగ్రాములు |
| ఫాస్ఫరస్ | 151 | ,, |
| ఇనుము | 4 | ,, |
| విటమిన్ | 4. 61 | ,, |
| థియామైన్ | 0. 436 | ,, |
| రిబోఫ్లావిన్ | 0. 215 | ,, |
| నియసిన్ | 5. 50 | ,, |
| ఏస్కార్బిక్ ఏసిడ్ (విటమిన్ సి.) | 135 | ,, |
| కాల్షియం పాంటోథినేట్ | 1. 83 | ,, |

ఆయా పదార్థాల విశేషములేమిటో మరొకసారి వ్రాస్తాను. ఇప్పటికి ఇన్నిముఖ్య పదార్థాలు ఆచిన్న ఎర్రటి, అందమైన, రుచికరమగు పండ్లలో ఉన్నాయని తెలిస్తే చాలు. అందుచేతనే డాక్టర్లు, పిన్నలు పెద్దలు పుష్కలంగా వీనిని తింటే పుష్టికలుగుతుందని చెప్తున్నారు.

# గృహలక్ష్మి పద్యరత్నములు

శ్రీ కల్లూరు అహోబలరావు

ఊయ్యాలఁబెట్ట వమ్మా!
నెయ్యంబునఁ బుత్రకునకు నీరజగంధీ!
యొయ్యారంబునఁ బాడుము
తియ్యని కంఠంబుతోడ దీ గృహలక్ష్మీ!

జోజో! ముద్దులనేత్రా!
జోజో! నాప్రేమ పాత్ర! జోజో! పుత్రా!
జోజో! నిర్మలగాత్రా!
జోజో!' యని యూపవమ్మ! శుభ గృహలక్ష్మీ!

మంగళ దేవతవమ్మా!
మంగళములు నీకు! నీ కుమారున కెలమిన్
మంగళము నీదుభర్తకు
మంగళమగు లోకమునకు మాగృహలక్ష్మీ!

ప్రియునితో పీటలఁగూర్చొని
ప్రియనామము పుత్రకునకుఁ బెట్టగవలయున్
ప్రియునకొసంగుము కొమరుని
ప్రియఁపడు సుతునెత్తి నతఁడు ప్రియగృహలక్ష్మీ!

తోయము వారలఁ బిలిచియు
పాయసమును దినఁగ వలయుఁ బంధుగగానన్
ఆయువు నారోగ్యంబును
శ్రేయము నీకబ్బుగాత! శ్రీ గృహలక్ష్మీ!

మన్నింపుము చెలికత్తెల
మన్నన పనికత్తెకిమ్ము; మంతిరసానిన్
తిన్నగ మన్నింపుము, నిన్
మన్నించును దేవుఁడెపుడు మాగృహలక్ష్మీ!

(సశేషము)

# గృహలక్ష్మి ఏజంట్లు:

—○—(★)—○—

గుంటూరు: వెల్‌కం & కో.
కర్నూలు: బాలసరస్వతి బుక్‌డిపో.
బెజవాడ: మాడరన్ న్యూసు ఏజన్సి.
అనంతపురము: వై. సాంబయ్య.
భద్రాచలం: టి, వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్చి. బాపనయ్య.
నర్సాపూరు: వై. సుందరరామయ్య.
కావలి: జి. రంగయ్య.
మాచర్ల/మారుటేరు: వి. వి. సుబ్బారావు.
పిఠాపురము: యం. సూర్యరాజు.
మచిలీపట్నము: టి. బి. నారాయణశింగ్.
ఏలూరు: శేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
బరంపురం : కె.వి.రంగారావు.
విశాఖపట్నం : సిటి న్యూస్ ఏజన్సి.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
బళ్ళారి: యస్. గురునాథ్
నెల్లూరు. ఎ. వి. నారాయణయ్య.
విజయనగరము : పి. నారాయణప్పడు.
కడప : వై. వి. సుబ్బారావు.
గుత్తి : వి. హనుమంతాచార్.
భీమవరం: యస్. సూర్యనారాయణ.
తెనాలి : కృష్ణమోహన్ & కో.,
పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యస్. రాధాకృష్ణయ్య
అంబాజీపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యస్. మూర్తి.
ఖర్గపూరు: యస్. ఆర్. నాయుడు.
పార్వతీపురము: ఎ. వి. వి. యస్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
విశాఖపట్నము : ,, ,,
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: శేషనలుస్టోర్సు.
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
జంషెడ్‌పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం: జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ : ముత్యాలు & సన్సు.
హైదరాబాద్ : నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి. గోపాల్ రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం : వి. వి. రంగాచారి
చోడవరం : పి. విశ్వేశ్వరరావు.
తిరుపతి : ఆర్. చంచల్ రావు
చీరాల. పి. సూర్యనారాయణ
పుత్తూరు : ఎ. యస్. ఎ. అయ్యర్.
గణపవరం : ఆర్. సుబ్బారావు.
కొడవలూరు : జి. వీరరాఘవులు.
కూచిపూడి . జి, సీతారామయ్య.
వేలూరు : ఎ. [illegible] శాస్త్రి

హిగిన్‌బాథమ్ స్టాలులవద్ద దొరకును.

☞ ఇతరచోట్లకు ఏజంట్లు కావలయును; డిపాజిటుతో దరఖాస్తు పంపుకొనుడు.

# శుభ్రమైన చలువ..






## ఏదంటే OK చలువే!







తయారుచేయువారు : ది ఈస్టు ఏషియాటిక్ కంపెనీ (ఇండియా) లిమిటెడ్, మద్రాసు.

EAE 1078

# భగవన్నుతి

తపనీయ కమనీయ తారహారములతో  రహినింపు కంఠహారంబు తోడ
కమనీయ మహనీయ ఘననీలకాంతి తో  కరకు బంగరుచేల కాంతి తోడ
కనుపండు వొనరించు కమలనేత్రముల తో  ఘనమణి కుండల కాంతి తోడ
పూర్ణేందు బింబంబు బురుడించు మోముతో  మెరుగు చామనచాయ మేని తోడ

దివ్య రత్న కిరీటపు దీప్తి తోడ  రమ్య నవ రత్న కంకణ రవము తోడ
రమ్ము నే జేయు పూజ గైకొమ్ము వేగ  విమల కళ్యాణ గుణశీల విశ్వ పాల.

రమణీయ మైనట్టి రవల తురాయితో  సిరులొల్కు కన్నుదా మరల తోడ
హరినీల మణికాంతు లలరించు మోముతో  కమ్మకస్తురిబొట్టు కాంతి తోడ
మహనీయ తాటంక మణిగణ ద్యుతులతో  పసిడికాలువ వలె వాటు తోడ
భువనమోహనమైన పువ్వుహారము లతో  శ్రీవత్సకౌస్తుభ శ్రీల తోడ

ముద్దుగుల్కెడి చిరునవ్వు మోము తోడ  కలిమిచెలిగూడి రాగదే కరుణ తోడ
భక్త రక్షణ బిరుదాంక పరమ పురుష  విమలకళ్యాణ గుణశీల విశ్వ పాల.

విష్ణు మయంబను విమలభూముల యందు  మేఘ గర్జనమందు మెఱుపు లందు
వేదముల్ పఠియించు విప్రకోటుల యందు  మఱియుమారుత మందు మధువు నందు
పద్మాకరము లందు బ్రహ్మాదిసుర లందు  తరణి సుధాకర తార లందు
చిలుకపలుకు లందు సిద్ధసాధ్యుల యందు  రాయంచ నడ లందు రాజా లందు

కమలసంభవనూతి సద్గాన మందు  మాధవు నుతించెడు కవుల మాటలందు
నీస్వరూపమె గనుపించు నిశ్చయముగ  విమలకళ్యాణ గుణశీల విశ్వ పాల.

ప్రాగ్దిశ నుదయించు బాలసూర్యుని కాంతి  నీలమణుల కాంతి నింగి కాంతి
నిండుపున్నమ నాటి పండువెన్నెల కాంతి  ఫణులశిరమున నుండు మణుల కాంతి
శారద రాత్రుల చంద్రబింబము కాంతి  మేఘంబు లోపల మెఱుపు కాంతి
పరమ పూరుషుగను భక్తునిముఖ కాంతి  చుక్కలలో వేగు చుక్క కాంతి

రాత్రివేళప్రకాశించు రత్న కాంతి  యిన్నికాంతుల దీపించు నిన్ను మదిని
నే దరింపగ ప్రార్థింతు నీర జాక్ష  విశ్వకళ్యాణ గుణశీల విశ్వ పాల.

దాసరి బాలాత్రిపుర సుందరీదేవి.

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. యస్. కేసరి.

## అరవవిద్యార్థులు—ఆంధ్రవిద్యార్థులు.

మద్రాసులో నేను కొంత ప్రయోజకత్వమును సంపాదించిన పిమ్మట పచ్చయప్ప కాలేజికి ప్రక్కన యుండిన బండరువీధి 9 నెంబరు యింటికి నాకాపురమును మార్చితిని. అక్కడనే వైద్యశాలకూడ యుండెను. ఈ బాడుగయిల్లు పెద్దదగుటవలన మిద్దెమీదయొక భాగమును ఆంధ్రవిద్యార్థులకు బాడుగకు యిచ్చితిని. ఈ యింటియెదురగనే వైశ్య విద్యార్థుల వసతిగృహముండెను. ఈ మూడవయింటిలో పచ్చయప్పకాలేజి హాస్టలును అప్పుడేపెట్టిరి. ఈ హాస్టలుకు చనిపోయిన K. A. వీరరాఘవాచారిగారు (నెల్లూరు) మేనేజరుగనుండి నడిపించుచుండిరి. ఇందువలననాకు అరవ తెలుగువిద్యార్థులతో మంచి పరిచయ ముండినది. వీరు వైద్యసహాయమునకు, చేబదులుకు నావద్దకు వచ్చుచుండిరి. ఈ పరిచయము వలన విద్యార్థుల విషయములను నేనిక్కడ వ్రాయగలిగితిని.

అరవవిద్యార్థులు చదువుకొనుటకు మద్రాసుకు వచ్చునపుడు తమతోకూడ రెండు చొక్కాలను, రెండు తుండుగుడ్డలను, రెండు చుట్టుపంచలను, రెండుపైపంచలను, రెండు గోచులను తెచ్చుకొందురు. మద్రాసుకువచ్చిన వెంటనే చౌకగ భోజనమునుపెట్టు హోటలులోచేరుదురు. ఆ కాలమున అరవ విద్యార్థులకు హోటల్సులో రు 6 లకు అన్నమునుపెట్టుచుండిరి. ఇద్దరుముగ్గురు చేరిఒక రూమును బాడుగకుతీసుకొని చదువుకొనుచుండిరి. అప్పుడప్పుడు వారు కాలేజిలైబ్రెరికిపోయి చదుకొనుచుండిరి. వారిగుడ్డలను వారేవుతుకుకొనుచుండిరి. చాకలివానికి వీరుబట్టలనువేయరు. తెల్లవారగనే వీరు కొళాయివద్ద స్నానముచేసి ఉతికిన బట్టలనుకట్టుకొని భోజనమువేళకు హోటలుకుపోయి అక్కడనుండి కాలేజికి పోవుచుండిరి. ఆ కాలమున కాలేజివిద్యార్థులు తలగుడ్డలను ధరించుచుండిరి. గనుక వీరు తెచ్చుకొనిన పైపంచను తలకు చుట్టుకొని పోవుచుండిరి. వీరుహోటలులో భుజించు భోజనముతప్ప చిరుతిండ్లకు ఆశపడరు. గదినివిడచి షికార్లుపోరు. ఒకే రూములో యిద్దరు ముగ్గురుండినను సకృతుగ సంభాషించుకొనుచుందురు. మంచిస్నేహముతో మెలగుచుందురు. ఒకరుకొన్న పుస్తకమును మరియొకరుకొనక సర్దుకొనుచుందురు. ఇంటినుండి

వచ్చినడబ్బును దుబారాచేయక మిగుల్చుకొనుచుందురు. ఆటపాటలకు వీరుపోరు. తాంబూలమునుముట్టరు. ఒక విద్యార్థికి జబ్బుచేసినప్పుడు మరియొకడు హోటలుకుపోయి అన్నమును తెచ్చిపెట్టును. మరియొకడు ధర్మవైద్యశాలకుపోయి మందులను తెచ్చి యిచ్చును. ఆ కాలమున అనిబిసెంటు, గోక్లే, వివేకానంద మొదలగు గొప్పవారి ఉపన్యాసములు జరుగుచుండినందున వాటికి వీరు తప్పక పోవుచుండిరి. ఈవిధముగ అరవ విద్యార్థులు పల్లెప్రాంతముల నుండి పైపంచలతో వచ్చి పరీక్షలను గొప్పగనిచ్చి హైకోర్టునందును, రివిన్యూబోర్డు నందును, కలెక్టరు ఆఫీసులందునేగాక విద్యాలయము లందును వైద్యాలయములందును మరి అనేకసర్కారు సంస్థలందునుకూడ నిండియున్నారు. (ఆంధ్ర దేశమున అరవ ఆఫీసరులేని జిల్లాలేదు. సాధారణముగా ప్రతిజిల్లాలోను అరవ లాయరే లీడరు. కొందరు ఆంధ్రదేశమున భూవసతులను సంపాదించుకొని పేరు ప్రతిష్ఠ లతో తెలుగువారి కంటె గౌరవముగ నున్నారు. తెలుగు కక్షిదార్లు అరవలాయరువద్దకే తరుచుగ పోవు చుందురు.)

ఆంధ్రవిద్యార్థులు అరవవిద్యార్థులవలెనే ఆ కాలమున మద్రాసునకువచ్చి కాలేజి చదువును చదువుకొనుచుండిరి. ఈవచ్చినవారిలో బ్రహ్మచారులు, గృహస్థులు, బిడ్డల తండ్రులు వుండిరి. నాకు తెలిసిన విద్యార్థులలో ఒకతాతకూడ యుండెను. ఈ తాత బి. ఏ. లో యొక పార్టును పూర్తిచేయుటకు 10 సంవత్సరములుగ పరీక్షకు డబ్బు కట్టుచుండెను. ఈ విద్యార్థులు మద్రాసుకు వచ్చునపుడు మూడునాలుగు ట్రంకులనిండుగ సామానులను తెచ్చుకొనుచుండిరి. ఆ కాలమున హోల్డాల్ (Holdall) పడకలులేనందున పెద్దపరుపులో కొంతసామానునిమిడ్చి మోకుతోగాని మంచపునవారుతోగాని గట్టిగకట్టి రైలులో తూకమువేయకుండ ట్రంకులతోకూడ తెచ్చుకొనుచుండిరి. వారు తెచ్చుకొనిన ట్రంకులలో ఒకదానినిండుగ గుడ్డలు, మరియొకదానిలో పుస్తకములు, మూడవ ట్రంకునిండుగ ఆవకాయ, మెంతికాయ, బెల్లపుమాగాయ మొదలగు వూరగాయలను నిలవయుండు చిరుతిండ్లను తెచ్చుకొనుచుండిరి. నెల్లూరు, గుంటూరు ప్రాంతములనుండి దిగిన ట్రంకులలో గుడ్డలు, పుస్తకములతోకూడ అన్నములోపొడి, ధనియాలపొడి, ఎండు చింతాకుపొడి, తెల్లగడ్డలపొడి, కొరవికారము, నీళ్లుపోయకుండ నూరిన గోంగూర, చింతకాయ, మినుముల చింతపండుపచ్చళ్లు వుండెడివి. నిలవఉండుగారెలను, అరిశెలను, మణుగబూలను వీరు తెచ్చుకొనుచుండిరి. కొందరి పెట్టెలలో చుట్టపొగాకు, పొడిబుడ్లులుండెడివి ఒక శివభక్తుడు లింగార్చనకు తనతోకూడ నల్లరేగడిమన్నును బుట్టనిండుగ తెచ్చుకొనెను వీరు మద్రాసుకు వచ్చినవెంటనే మంచిహోటలు యెక్కడున్నదా యని వెతుకుదురు

ఎక్కడైతే వేపుడుకూరలు, పచ్చళ్లు, చాలినంత నెయ్యి వడ్డించెదరో అక్కడ ప్రవేశించెదరు. అయితే వీరు అక్కడ బాగా డబ్బు ఇచ్చుకొనవలయును. వీరు యింటినుండి తెచ్చుకొనిన పచ్చళ్లను, ఊరగాయలను హోటలుకు తీసుకొనిపోవుచుండిరి. వీరికి వారియిండ్లనుండి అప్పుడప్పుడు ఫలహారములు, పచ్చళ్లు పార్సిల్సు వచ్చుచుండెను. అయితే ఆదివారము నాడు హోటలులో చేసిన ఉల్లిగడ్డలసాంబారును అరవవారితో కూడ వీరును జుర్రుకొనుచుండిరి. ఆ నాడు చేసిన ఉర్లగడ్డలకూర వీర్లకు చాల రుచిగుండెడిది.

ఒక నెల్లూరి విద్యార్థి వంటరిగ నుండజాలక భార్యను రప్పించి మా యింటిలోనే ఒక భాగమును అద్దెకు తీసుకొని కాపురమును పెట్టెను. మరియొక విశాఖపట్టణపు విద్యార్థి కూడ అట్లనే చేసెను. వంగవోలునుండి వచ్చిన విద్యార్థియొకరు వేదం వెంకట్రాయశాస్త్రిగారి బొబ్బిలి నాటకములోని పాటలను, బిల్హణీయములోని పద్యములను తరుచుగ పాడుచుండిరి. మరియొకరు తెలుకుట్టినవారికి పోతన భాగవతము నందలి పద్యములను పాడుచు మంత్రించుచుండెను. ఇందువలన క్రమముగ వీరిని మేము మంత్రవేత్త యని పిలుచుచుంటిమి. ఒక అబ్బాయికి భార్యవద్దనుండి వచ్చిన జాబులో-మీరు మద్రాసుకు వెళ్లినపిమ్మట పెద్దబ్బాయి బెంగ పెట్టుకొని అన్నమును సరిగా తినడము లేదని వ్రాసియుండెను. అప్పుడు అబ్బాయి జుగుప్సతో సాయంత్రము బండికే రైలెక్కి ఊరికిపోయి నెలదినముల పిమ్మట తిరిగివచ్చెను. ఈ నెలదినములు లాకాలేజి క్లాసులో మరియొక అబ్బాయి వీరి పేరును పిలిచినప్పుడు హాజరు చెప్పుచుండెను. ఆ కాలమున ఒకరికొకరు ఇట్లు సహాయమును చేసుకొనుచుండిరి. క్రొత్తగ పెండ్లి చేసుకొనివచ్చినవారు సెలవులకు పలుమారు అత్తవారిండ్లకుపోయి వచ్చుచుండిరి. బందరువీధికి లాకాలేజి దగ్గిరగనుండినను నడిచిపోవుటకు బద్ధగించి బండ్లమీద కాలేజికి పోవుచుండిరి. కొంతకాలము ఉద్యోగమును చేసివచ్చి బి. యల్ క్లాసులో చదువుకొనుచున్నవారు లాంగ్ కోటులు తలగుడ్డలను ధరించుకొని కాలేజికి పోవుచుండిరి. వారమునకొకసారి చాకలి యిస్త్రీబట్టలను తెచ్చుచుండెను. ఆ కాలమున స్వంతక్షౌరం (Self shaving) అలవాటు లేదు గనుక తెలుగు మంగలి ప్రతిదినము వచ్చుచుండెను. ప్రతిశనివారము జెట్టివాడు వచ్చి సుగంధతైలములతో తలంటి పోసిపోవుచుండెను. దినమునకు మూడుపర్యాయములు రవేసి తమలపాకులను, సుగంధపు పీటికా వక్కపొడిని, జింతాను మాత్రలను వాడుకొనుచుండిరి. చదువుకొనుచుండిన ఒక అబ్బాయి వున్నట్లుండి కనుపడకపోయెను. ఆ అబ్బాయి నాకు చాల ఆప్తుడగుటవలన ఊరంతయు వెతికి వేసారి కడపట ఒక అమ్మాయి ఇంటిలో చూడగలిగితిని. సాయంసమయమున అందరు కలసి హైకోర్టువద్దయుండు బీచికిపోయి, 7 గంటలకు బైలుదేరి దోవలోయుండు హోటలుక

పోయి వచ్చునపుడు గుజరాతిమితాయి అంగడిలో రెండుతీపి, రెండుకారము పొట్లములను కొనుక్కొని యింటికివచ్చులోపల దోవలోనే ముగించి వచ్చుచుండిరి. అప్పుడందరు తాంబూలమును జాడించి పక్కలను పరచుకొని పండుకొని తలప్రక్కన మగినపువత్తుల దీపములనుపెట్టుకొని చదువుకొనుచు నిద్రించుచుండిరి. వీరికి పగలుకూడ పండుకొని చదువుకొనుట అలవాటుగనుండెను.

ఆ కాలమున మద్రాసులో పార్శినాటక కంపెనివారువచ్చి లాకాలేజికి ప్రక్కన నాటకశాలను నిర్మించి నాటకములను ఆడుచుండిరి. ప్రతిశనివారము ఆదివారము అందరము కలసి వెళ్లుచుండెడి వారము. కందస్వామిగుడికైలాస పర్వతోత్సవమునకును, పార్థసారథి స్వామి అద్దాలపల్లకి మహోత్సవమునకుకూడ అందరముకలసి పోవుచుంటిమి. ఆ కాలమున జుట్టుకత్తిరింపులులేవు గనుక కొందరు జుట్టుకు కేశరంజన తైలమును పూసుకొని మల్లెపూలను చుట్టుకొనుచుండిరి. వనభోజనములకు తిరువత్తియూరును, మైలాపూరు తిరునాళ్లకును పోవుచుంటిమి. ఈప్రకారము ఆంధ్రవిద్యార్థులు ఆకాలమున కాలమును కులాసగ గడుపుచుండిరి. ఇంటినుండివచ్చు డబ్బుచాలక అప్పుపెట్టుచుండిరి. వివాహమైన విద్యార్థులు త్వరగపరిక్షలను ముగించుకొని స్వస్థానములను చేరుటకు కష్టపడి చదువుచుండిరి. కాని బ్రహ్మచారులు పరీక్షలనుబేస్తుపెట్టుచుండిరి. "ఏలనంటే పరిక్షలను ప్యాసుచేసి ఆ పాడుపల్లెటూళ్లకు పోయిన మన ముఖమును చూచువా రెవరునుండరు. మద్రాసులోనేయుండి కాలేజిచదువుచు చదువుచుండిన మనకు మంచిమనుష్యులువచ్చి లావైన వరకట్నములు లభించును" అని చెప్పుచుండిరి. "ఈమద్రాసు సుఖములను మరిగినవారము ఆపల్లెటూళ్లకుపోయి మనమెట్లు కాలమును గడపగలము"యని మరికొందరు చెప్పుచుండిరి. తోటి అరవవిద్యార్థులు పరిక్షలను తప్పక ప్యాసుచేసి వారిపూళ్లకు పోవుచుండిరి. అప్పుడు వీరు-"ఒరేసుబ్బారావు, ఈ అరవతొత్తులవలె రాత్రింబవళ్లు చదివి చచ్చిచెడిసున్నమైతే మనముమాత్రము ప్యాసుకాలేముట్రా" అని అనుకొనుచుందురు. "ఒళ్లుగుల్లచేసుకొని చదివినచదువు మనకెందుకురా"యని యొకరనేవారు.

ఆహార విహారదోషములవలన వీరువలుమారు పడకనెక్కుచుండిరి. డాక్టర్ల బిల్లులు పెరుగుచుండినవి. కొందరు పిల్లకాయలను తలితండ్రులువచ్చి యిండ్లకుతీసుకొని పోవుచుండిరి. ఆకాలమున ఆంధ్రవిద్యార్థులు క్రైస్తవమతమున చేరుచున్నారనే వదంతికూడ యుండినది.

# దీపావళీ దృశ్యములు

శ్రీ భాగవతుల పూర్ణయ్యగారు

మహారాష్ట్ర దేశమున దీపావళి పెద్దపండుగ. 'దీపావళి' 'భావుబిజ్' 'లక్ష్మీపూజ' అని మూడు దినములు సలుపుదురు. ఆంధ్రులు మహారాష్ట్రులు ఒకే నాగరికతాను సారులని చదువరుల కెరుక. ఇందలి సామ్యమును గుర్తించనగు.

పచ్చని మతాబకాంతుల పతిమొగంబు
నోరకంటను జూచె వయ్యారివిమల!
ఆమె చిరునవ్వువెన్నెల లంచు మురిసి
క్రొత్తయల్లుండు సొక్కె నా క్రొమ్మెరుగుల!

ఎఱ్ఱని మతాబ వెలిగించి యువురు పెంపు
మగని యారక్త నేత్రాల మగువచూచె!
ఆమె గొజ్జంగి పూబుగ్గ లతడు కాంచి
రాగవతి మెచ్చె మది ననురాగ మెసగ!

ముత్తెపు మతాబ గొని ముసి ముసి నగవుల
బావకివె పోయుచును తల బ్రాలటంచు
హాస్యమాడెడి చెలియల నదర జేయ
వెనుకను పటాకి పేలిచి విమల నవ్వె!

♦ ♦ ♦

వచ్చు దీపాళి మరునాడు "భావ్రబిజయు"*
అక్కసెల్లెండ్రు సోదరులందు ప్రేమ
చూపి వారిచ్చు మన్ననల్ చూరగొందు
రాదినంబంత సుదినంబు లేదు లేదు.

సోదరీమణు లానాడు సోదరులకు
నలిచి తలలంటి తగు దీవనల నొసంగి
డోలికల నుంచి భావగీతాల పాడి
రక్తిగా నిత్తురంత నీరాజనమ్ము!

* భగినీహస్తభోజనము

వచ్చెగా సోదరీ మణుల్ పట్టిత్రిప్ప
కప్పురపు హారతిని గొన గలుగు వారి
దెంతభాగ్యము ! తొల్లి దండెత్తి వెడలి
విజయులయి వచ్చు వీరులావిధి వడసిరో!

♦ ♦ ♦

ముత్తెపు నత్తులన్ తొగరు పుప్పొడి నీలపు రంగు చీరలన్
యొత్తుగ వెన్కకున్ ముడిచి యింపగు నూనె మెఱుంగు వేణులన్
పుత్తడి బొమ్మ యందముల పొల్పగు రంగుల వల్లెవాటులన్
మొత్తముకూడి వీధులను ముచ్చటగా చరియించి రంగనల్.

బంగరు బుటాల చెట్టుసంపంగి వన్నె
పట్టుచీరయు నట్టిజాకెట్టు తొడిగి
మేలిముసుగుముత్తెపు నత్తు కీలుకొలిపి
విమల యీ వేళ పిలచెను పేరటాండ్ర !

మూడవదినమ్ము వరలక్ష్మిపూజలెసగ
వీధివీధిని యింటింట వేడ్కమీర
హీరదీపిక మంగళ హారతులను
పట్టి గాలలు దేవిని చుట్టికొలువ !

♦ ♦ ♦

భావగర్భితమ్ములు మోదభాజనములు
భారతపురాతాగ్ర్య గౌరవస్ఫోరకములు
విస్మృతార్య నాగరకతా బీజతతులు
శ్రీకరమ్ములు పంగరీతులరయ !

—నారచించిన "అమరజ్యోతి" అను
ఖండ కావ్యమునుండి యేరినవి.






అక్కలకర్ర :— పచారి దుకాణములలో సామాన్యముగా లభించును. ఇట్టి ఏకమూలికా వైద్యము వల్ల వ్యాధులు శమించును. చికిత్సా పరిశోధనలకు దోవచూపును.

దీనిచూర్ణము అన్నివ్యాధులకు పనిచేయును. కషాయముగా కాచి కూడ యివ్వవచ్చును. చూర్ణ మయిన పూటకు $\frac{1}{2}$ తులం వాడవచ్చును. కషాయ మయిన $\frac{1}{2}$ ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు వాడవచ్చును.

పురాణ శ్వాసకోశ వ్యాధుల యందును, ధాతుక్షీణత యందును బాగుగ పనిచేయును. శరీరతూక ములు కూడ హెచ్చునని డాక్టరు కోమన్‌గారి పరిశోధనా ఫలితములు తెల్పుచున్నవి. బలహీనతచే కల్గు దగ్గు, ఎక్కిళ్ళు నెమ్మదించును. క్షయవ్యాధుల యందుపడు కిళ్ళెలోకల క్రిములను నశింపచేయుట యందు కూడ యీదివ్య ఓషధికి ప్రభావమున్నది.

దీనిగంధమును నొప్పిగలచోట పూసిన తగ్గును. పుండ్లపై దీనిచూర్ణమును చల్లిన చీముపట్టక త్వరలో ఆరిపోవును.

దీనికషాయమును పుక్కిలించి వుమియుట వల్ల దంతవ్యాధులు నెమ్మదించును. నోరుదుర్వాసన పోవును. జిహ్వకు రుచి యొసంగును.

వుద్దిపాలు చెట్టు:— (వుద్దిపాల చెట్లలో) పెద్దవుద్దియని కూడ అంటరు. ఈచెట్టునకు జిగురు పదార్థ మంటియుండును. ఆబంక సువాసన యుతముగ నుండును. నీళ్ళవిరేచనములకు దివ్యౌషధమని చెప్పవచ్చును. దీనిబెరడుతో కషాయముకాచి పూటకు $\frac{1}{2}$ ఔన్సుచొప్పున యిచ్చిన సముద్రతీర వాసులకును, జైళ్లలోనుండు ఖైదీలకును బాగుగ పనిచేయునని డాక్టర్ కోమన్‌గారి రిపోర్టువల్ల తెలియుచున్నది.

**పునర్నవ:**- ఎండలకు ఎండిపోయి, తొలకర్లు వర్షించగనే స్వయముగ మొలకలెత్తును. నీటిచారల యందు మంచినీళ్లు చెరువులు, దొరువుల ప్రాంతములందు కానుపించును. దేశీయ వైద్యమునకు అనువైన మూలికలలో నొకటి. గల్జేరు అనికూడ దీనికిపేరు గలదు. ఈమూలికయొక్క చూర్ణముతో మండూరము మిశ్రితమయిన (పునర్నవ మండూరము) ఔషధముగ వాడెదరు. రక్తక్షీణత యందును పాండువునందును పురాణజ్వరములచే శల్యాకృతినొందిన వారికిని బాగుగపనిచేసి తృప్తికరమయిన గుణములిచ్చి యున్నదని డాక్టర్ కోమన్‌గారి రిపోర్టువల్ల తెలియుచున్నది. రోజునకు రెండు మూడు పర్యాయములు వ్యాధిపరి స్థితుల ననుసరించి తడవకు 30 గ్రెయినుల చొప్పున కూడ యివ్వ వచ్చును.

# బ్రతుకు తెరువు

స్త్రీలు అనేకరకములైన చేతిపనులు కుట్టు, అల్లికపనులు, చెమ్కీ పనులు చేయుదురు. అందులో ఒక విధమైన చేతిపని నేను స్త్రీలకొరకు వ్రాయుచున్నాను. అయితే ఇట అపురూపముగా ఇండ్లచేయు దానిని ఒకటి వ్రాయుచున్నాను.

సాధారణముగా మన ఇండ్లలో కార్యకలాపములకు, అనేక రకముల హారములు తయారుచేయు వాడుక, మరికొన్ని బజారులో కొనుట వాడుకయైయున్నది. అందులో కర్పూరపుహారములు చాలా ముఖ్యము; వెలగల్గి అందమై సువాసనగలవి. వీనినిచేయుట ప్రతిస్త్రీయు నేర్చుకొనవలెనని ఆశతో వ్రాయుచుంటిని.

మనకు తోచినంత ముద్దకర్పూరం తెచ్చి ఒకదబరా గిన్నెలో వేసి మూతికి సరిపడపళ్లెమును మూతవేసి గిన్నెలోనుంచి ఆవిరి పైకి ఏమాత్రంరాకుండా పళ్లెమునకు గిన్నెకు సందులేకుండా సున్ని పిండితోనో లేక రాగిటి మన్నుతోనో మూసివేసి పైపళ్లెములో నీరుపోసి పొయ్యిమీద పెట్టవలెను. తదుపరి గిన్నె క్రింద సన్నగా మంటపెట్టవలెను. లోపల కర్పూరం ఉడకుట మొదలుపెట్టగానే గుడుగుడుమని సన్నటిశబ్దంపుట్టును. ఈశబ్దమును శ్రద్ధగా గమనించి ఆగిపోగానేగిన్నెను పళ్లెముమీద నీటితో కదలకుండా క్రిందకుదింపవలెను. ఒకబట్టతో పళ్లెములో నీరువత్తి పిండివేయవలె. అప్పుడు కత్తితో అతిగించిన పిండినితీసివేసి మూతపెట్టిన పళ్లెమును ఒకతెల్లని బట్టమీదగాని కాగితముమీద గాని బోర్లించవలెను. అప్పుడు గిన్నెలో కర్పూరములోనున్న మన్ను మకిలీ మిగిలి కర్పూరమంతయు పళ్లెమునకు అట్టవలె అంటుకొనియుండును. ఒకకత్తితో దానిని మైనపువత్తిని గీకినట్లు గీకిన పొట్టువలెను పడును. ఆపొట్టును మనకు ఎంతపైజు ఉండకావలెనంటే అంతదిగ అరచేతిలో పెట్టుకుని గుండ్రగ నొక్కి ఉంచవలెను. ఆ గుండ్లను నునుపుగను డోరియాలుగను చేయుటకు అచ్చులుండును. దగ్గరగా నేతగల ఒకక్రొత్త గుడ్డముక్కను క్రింద అచ్చులోవేసి కర్పూరపుగోలీని దానిలోపెట్టి పైన రెండవ అచ్చుకప్పి తేలికగ కొయ్యసుత్తివంటి దానితో కొట్టవలెను. తర్వాత అచ్చును విడదీసిన గుండు నునుపెక్కును. దోరియాలు కావలసిన ఇదేవిధముగ దోరియ అచ్చులోపెట్టి కొట్టితీసిన దోరియాలు ఏర్పడును. అచ్చునుండి తీయునప్పటికి రంధ్రములు వేయవలసినచోట కొద్దిగ నొక్కుపడిఉండును. సన్ననిఊలు అల్లికపుల్లలనుగాని లావు సూదిగాని కొసకాల్చి గుండుపైన నొక్కులోత్రిప్పినఎడల రంధ్రములేర్పడును. తర్వాత గుండ్లను లావు పాటి దారములోగ్రుచ్చి పూసకుపూసకు మధ్య రంగులతోలును చిన్నకుచ్చువలెకట్టి చివర కుచ్చుకట్టవలెను. గుండ్లు దోరియాలపైనచో నక్కిగాని జరీగాని దోరియాసందులలో చుట్టవలెను.

గుండ్లు పెద్దవైనచో ఊలుకుబదులు నూలుతో గోలీలుగాచుట్టి గుచ్చి వాట్లకుకూడా జరీగాని నక్కిగాని చుట్టవలెను.

అచ్చులు గేదకొమ్ముతోను, కంచుతోను విశాఖపట్నములో ఎక్కువగచేయుదురు. కొయ్యతోను చేయుదురు. ఇవి చౌక. మనవైపులను వర్కుషాపులలో చేయుదురు. స్త్రీలందరు ఈ పనిని నేర్చుకుని వారివారిండ్లలో కార్యకలాపములకు వాడుదురని నా ఆశయము.

పండ్రంగి వెంకటలక్ష్మమ్మ.





## అరటికాయ ఆవకాయ

నలుబది యెనిమిది తులముల తూనికగల అరటికాయలయొక్క తొడిమెలును, పై చెక్కులను తీసివేసి, సన్నబిళ్లలుగా తరిగి యుంచవలెను. రెండుశేర్ల మంచినీళ్లను ఒకపాత్రలోపోసి పొయ్యిమీదపెట్టి సలసలకాగిన పిమ్మట అరటికాయ బద్దలను అందులో వేయవలెను. అరతులము ఉప్పును ఉడుకుచున్నటువంటి బద్దలలోవేసి మూత పెట్టి, ఉడికిన తరువాత వడియకట్టి యుంచవలెను. మరియొక కళాయిపాత్రలో శేరున్నర నీళ్లుపోసి రెండుతులమున్నర చింతపండునువేసి గింజలు, పిప్పి, కాడలు మొదలగునవి తీసినంతట పొయ్యిమీదపెట్టి మరిగించి అందులో అరటికాయ బద్దలను వేయవలెను. ఒకతులము ఆవాలు, తులము మిరపకాయలు, తులము తెల్లనువ్వులు, కొబ్బరికోరు యెనిమిది తులములు, వసుపుపొడి ఒక పావులాయెత్తు వీటినన్నిటిని రోటిలోవేసి కొద్దికొద్దిగా నీళ్ళుచల్లుచూ రుబ్బి పొయ్యిమీద యున్నటువంటి గుజ్జులో వేయవలెను. వెంటనే ఒక తులము ఉప్పువేసి గరిటెతో బాగుగాకలిపి తిరుగ బోతవేసుకుని క్రిందికి దించి కొంచెముగా యింగువను వేయవలెను.

## నువ్వుపొడి వేసిన చిత్రాన్నము

ఒక శేరు సన్న బియ్యమును పావుఘంట కాలము నీళ్లలో నానవేసి వడియ కట్టవలెను. మూడుశేర్ల మంచినీళ్ళను అయిదుశేర్లు నీళ్లు పట్టు పాత్రలోపోసి పొయ్యిమీద పెట్టి కాచవలెను. నీళ్లు కాగుచుండగా అరతులము వసుపుపొడివేసి, పొంగు వచ్చుటతోడనే వడియకట్టియున్న బియ్యమునుపోసి గరిటెకాడతో కలుపుచు మూత పెట్టవలెను. బియ్యము మూడుపాళ్లు ఉడుకుటతోడనే గంజివార్చి, ఆ పాత్రను క్రిందికి దించి నిప్పులమీద మూడు నిమిషములుంచి అన్నమును ఒక వస్త్రములో ఆరబోయవలెను. మిరపకాయలు అరతులము, ధనియాలు ఒక తులము, మెంతులు నాలుగు అణాలయెత్తు, మిరియాలు ఒకతులము, జీలకర్ర అరతులము, మినప్పప్పు అరతులము యీ పదార్థములన్నిటిని నేతిలో వేరువేరుగా వేయించి, రోటిలోవేసి, మెత్తగా పొడి చేసి, ఆరపోసిన అన్నములో కలుపవలెను. తరువాత రెండుతులముల ఉప్పుపొడివేసి, కొంచెము నూనె చేతులకు రాచుకొని అన్నమును కలుపుచుండవలెను. అర్ధశేరు

మంచినీళ్లను పదునైదు తులముల చింతపండునువేసి, గింజలు మొదలయినవి తీసివేసి, గుజ్జులో రెండుతులముల ఉప్పుపొడిని వేయవలెను. ఇరువదినాలుగు తులముల మంచినూనెను వేరొక కళాయి పాత్రలోపోసి పొయ్యిమీదపెట్టి కాగుచుండగా నాలుగు తులముల మిరపకాయలను వేయవలెను. మిరపకాయలు రెండు భాగములు వేగిన పిమ్మట రెండు తులముల ఆవాలు వేయవలెను. ఇవికూడ యర్ధభాగము వేగిన పిమ్మట, నీళ్ళల్లో నానబెట్టి వడియకట్టియుంచిన యిరువదినాలుగు తులముల శనగపప్పు వేయవలెను. తరువాత కాడలుతీసిన కరివేపాకు ఆకులను ఒక తులము వేయవలెను. రెండు అణాల యెత్తు యింగువను కొట్టి పొడిచేసి తిరుగబోతలో వేయవలెను వెంటనే, ఆ తిరుగబోతలో సిద్ధముచేసియుంచిన చింతపండు గుజ్జునుపోసి గరిటెకాడతో కలుపవలెను. కొంతసేపు ఉడికిన తరువాత గుజ్జు అంతయు చిక్కపడును. అప్పుడు గుజ్జును అన్నములోవేసి బాగుగాకలిపి, యెనిమిది తులముల తెల్లనువ్వులపొడి చల్లవలెను.

వి. సుశీలాదేవి.

---

# ఇంటిపనులలో మెళకువలు

## బిడ్డయెడల తల్లి చేయవలసిన విధులు

బిడ్డపుట్టిన తొమ్మిది రోజులవరకు ప్రతిరోజు ఉదయము రెండువ్రేళ్ల ఉగ్గు నాకించిన దినమునకు రెండుమూడు విరోచనములుఅయి సుఖముగా నిద్రించును. అక్కడనుండి తల్లి పాలబిడ్డకు ఏమియు పట్టనవసరములేదని నా యభిప్రాయము. పోతపాలబిడ్డకు విరోచనము మందము గనుక అట్టి బిడ్డకు రోజువిడిచి రోజు ఆముదము రెండువ్రేళ్లు నాకించిన ఫ్రీగా విరోచనము జరుగగలదు.

ఒక్కొక్కప్పుడు తల్లిపాల బిడ్డకును విరోచనము మందమగును. అప్పుడు వెచ్చజేసిన ఆముదము బిడ్డదిట్టత ననుసరించి పట్టవలయును. ఇంకనుగాకున్న సన్‌లైటు సబ్బుముక్క కొంచెము పొడవుగాను, చివరసూదిగాను ఉండునట్లుచెక్కి నీరుతడిజేసి, కొంచెము నునుగువచ్చునట్లుగాజేసి, ఆ ముక్కను బిడ్డ మలమువిడుచు ద్వారములోబెట్టి ఒక సెకండు ఉంచవలెను. వెంటనే కొంతసేపటికి విరోచనమగును. కానిచో మరికొంతసేపాగి తిరిగిఅట్లుచేసిన ఈసారి తప్పక విరోచనమగును. తల్లిపాల బిడ్డకుకూడా ఒక్కొక్కప్పుడు రెండుమూడు రోజులవరకు విరోచనమవకున్నను తల్లి కంగారుపడవలసిన అవసరములేదు.

కడుపుపొంగుఉన్న కొంచెము కాచిన మంచిది. వారమునకొకమారు చిన్నబిడ్డసామానులు (కోమటిని అడిగిన చెప్పును) ఒక్కొక్కరాపు వేడినీళ్లతో సానరాయిపై రాపితీసి ఆముదములో కలిపిపట్టిన బిడ్డకు కఫము పెరుగకుండా యుండును. ఆ దినము బిడ్డకు తలంటి స్నానము తప్పక చేయించవలయును. లేకున్న వేడిచేయును. తల్లి పథ్యమేమియు జేయనవసరములేదు. అనుకూరలు తల్లి ఎక్కువగాతినరాదు. తక్కిన పదార్థములేమితిన్నను ఏమాత్రము హానిలేదని నేను హామీఇవ్వగలను. పోతపాలబిడ్డ తల్లిమాట మరిచెప్పనక్కరలేదు. కొంతమంది బిడ్డకు రెండుపూటలు కాపించెదరు. ఇది మంచిఅలవాటుకాదు. మోటువారు బిడ్డకు బట్టలువేయకుండా నూనెరాసి అట్టేగాలిలో పరుండబెట్టుదురు. వారికిచల్లగాలి తగులకుండా యుండుటకు నూనె సాయపడును. విద్యలు నేర్చినవారుకూడా బిడ్డఎంత ఏడ్చుచున్నను ఎర్రగా శరీరమగువరకు కాపింతురు. దానిపైన చొక్కావేసి చల్లగాలి తగులకుండా నుంచెదరు.

బిడ్డకు రొంపగానున్న కొంచెము గుండె, వీపు కాపించిన మంచిదిగాని అలవాటుగ బిడ్డను కాపించరాదు. ఇందువలన బిడ్డశరీరము మృదుత్వము నశించి మోటుదేరును. నూనెరాసితుడిచి పరుండబెట్టిన మంచిది.

బిడ్డకు మూడునెలలు నిండువరకు తలపై బట్టయో, టోపీయో యుంచవలయును. ఎండాకాలమైన అంత పట్టింపులేదు. మాడుపై రెండుపూటల నువ్వులనూనెవ్రాసి, కొద్దిగా రుద్దవలయును. ఇట్లుచేసిన మాడు ఏడాదిలోపులో పూడిపోవును. లేనియెడల బిడ్డకు తరచుగా రొంపజేయవచ్చును.

బిడ్డకు ఆరుమాసములవరకు రోజువదలిరోజు నలిపి నీళ్లుపోయవలయును. నీళ్లపోత, పాలపోత సరీగా వేళకు జరగవలెను. అసలు బిడ్డపెరగడం నీళ్లతోను, పాలతోనే అనితల్లి మనసునుంచుకొని జాగ్రత్తపడవలయును. నీళ్లపోత జరగగానే తలతుడిచి ముక్కురంధ్రములు, చెవిరంధ్రములు శుభ్రముగావత్తి సాంబ్రాణి, పసుపు, తెల్లఉల్లిపొట్టు, వాము మొదలైనవి వరుసగా పొగవేసి పౌడరువ్రాసి ముఖ్యముగా చంకల సందులలోను, తొడల సందులలోన, మెడక్రిందను ఎక్కువగావ్రాసి శుభ్రమైన జుబ్బాయును, మొలకు నాప్కిన్ (మూడుమూలలగుడ్డ) తొడిగి నిద్రింపజేసిన సుమారు రెండున్నర గంటలకు తక్కువ లేకుండా సుఖంగా నిద్రపోతుంది.

సాధారణంగా బిడ్డకు నీళ్ళుపోసిన తరువాత కాటుక, బొట్టు విషయము తీసుకొనే జాగ్రత్త పైవాటి యందు తీసుకొనరు.

ఆరునెలలు నిండినప్పటినుండి ఎంత తృప్తిగా తల్లి పాలున్ననుసరే ప్రతిబిడ్డకు సాయంత్రం నాలుగు గంటలకు రెండు గుల్లల "బార్లీవాటర్"లో కొంచెము ఉప్పు పటికి పంచదారగ కలిపి పట్టవలయును. బిడ్డకు జ్వరము తగిలిన "సిబజాల్"పిల్సు లేక M. B. 760 పిల్సు, డాక్టర్సు వాడమంటారు. అవి వాడేటప్పుడు తప్పనిసరిగా తల్లిపాలబిడ్డకైనను బార్లీవాటర్ దినమునకు ఒక ఔన్సు అయినా పట్టించవలయును. ఇక పోతపాలు బిడ్డకు వేరేచెప్పనవసరము లేదు. మరితప్పక బార్లీపోయవలయును. ఇట్లుచెయ్యక కొంతమంది తల్లులు "బిడ్డకు టెంపరేచరు దిగడంలేదనియు, ముచ్చటలుపోసి మళ్లా టెంపరేచరు హెచ్చుతుందనియు" వాపోవుదురు. డాక్టర్సు తొందరలో మరిచినా, తల్లి మరవకుండా జాగ్రత్తతీసుకొనిన బిడ్డకు టెంపరేచరు దిగుతుంది. ఇంకను అట్లే నిలచిన తలుపులన్నియు వైచినగదిలో గోరువెచ్చని నీటితో స్పాంజిబాత్ (తల్లి కాళ్లపై తెల్లనిబట్టవేసుకొని బిడ్డను నగ్నంగా పడుకోబెట్టి మొదటచేతులను తడిపిన బట్టతో తుడిచి, తిరిగిసబ్బురుద్దిన బట్టతోతుడిచి, తరువాత మంచి నీళ్లబట్టతో తుడిచి, పొడిబట్టతోవత్తి, వేరేబట్టతో గాలితగులకుండా కప్పుచుండవలయును. ఇట్లే శరీరములోని భాగములన్నియు తుడుచుట) చేసి తరువాత సాంబ్రాణిపొగవైచి జుబ్బావేసి గాలి తగలనిచోట కొంతసేపుఉంచు వెంటనే ఎక్కువగాలి తగిలిన జబ్బు హెచ్చును. తరువాత గాలిలో ఉంచినను ఫర్వాలేదు. ఇట్లాచేసిచూచిన తప్పక ఒకటిరెండు డిగ్రీల టెంపరేచరు దిగుతుందని నాయనుభవం.

ఒక ఆమె జ్వరపు బిడ్డకు ఆరుబయట కాళ్లపై పరుండజేసి తడిబట్టతో ఒళ్లు తుడుచుచున్నది. ఇది ఏమని నేనడుగ "స్పాంజిబాత్" అంది. అయ్యో! వెంటనే టెంపరేచరు హెచ్చిందిగాని తగ్గలేదు. అట్టి స్పాంజిబాతుకు తప్పకుండా న్యూమోనియా, వస్తుంది. కనుక పూర్తిగా తెలియనిపని చేయరాదు.

ప్రతితల్లి పెద్దపెద్ద విద్యలు నేర్చినను జాగ్రత్తలు నేర్చుకొనరు. విద్యనేర్చినను నేర్వకున్నను అనుభవముగలిగిన బిడ్డను క్షేమంగా సాకవచ్చును. అయితే ఏమిచదువనితల్లికి, బాగుగా చదివినతల్లికిచెప్పి వప్పించవచ్చుగాని, మిడిమిడి జ్ఞానముగలతల్లికి దేవతలైనజెప్పి చేయించలేరని అందరకు తెలిసిన విషయమే. మనజాగ్రత్తలో మనముపెంచినబిడ్డ ఆరోగ్యమునకు అట్టే లోపములు కలుగవు. పైన దైవాధీనము.

మనము తీసుకొనవలసిన జాగ్రత్తలో అశ్రద్ధచూపి "వానికర్మ వాడికి అయున్నలేందే" అని అనుకోవడంకూడా చూస్తున్నాము. వింటున్నాము. మనము చేయగలిగినదంతాచేసి పిమ్మట దేవునిదయ అనవలసినవారమని మరువరాదు. చంటి పాపలకు కొన్ని చిన్నవ్యాధులు తరుచుగా వస్తుంటాయి.

జలుబు:— సాధారణంగా స్నానం జేయించేటప్పటి పొరబాటువల్లరావచ్చు. వేడిలోఉంచి సడన్‌గా చల్లగాలి తగులుటచేరావచ్చు. సీజను మారినప్పుడు రావచ్చు. దీనినిమించిన రోగమేలేదంటాను. బిడ్డకు ఫ్లానల్ జుబ్బాతొడిగి తలకు టోపీకూడాఉంచవలయును. లేనియెడల లోపల ముతకగుడ్డ జుబ్బా వేసి మీదమరియొకజుబ్బా ఉంచవలయును. చనుబాలు మాడుపైకొద్దిగాపిండి మెత్తని సాంబ్రాణిగుండవేసి చిన్న బిళ్లవలె మాడుపై నొత్తవలెను. ఉదయము సాయంత్రము సాంబ్రాణిపొగవైచి చల్లగాలి తగులకుండా చూడవలెను. "యూకలిప్టస్"కూడా కొద్దివాడిన మంచిది. ముక్కునిండా దిమ్మకట్టి బిడ్డ ఊపిరితీయుటకును పాలుత్రాగుటకును ఉక్కిరిబిక్కిరిపడును. బట్టసన్నగాచుట్టి ఒకముక్కు రంధ్రములోబెట్టిన తుమ్మును. అప్పుడు ముక్కు శుభ్రపడును. లేని యెడల మనవేలు బిడ్డ అంగిలికానించి ఒకముక్కు రంధ్రములోఊదిన రెండవరంధ్రముగుండా చీమిడివచ్చి బిడ్డ కొంత తేలికపడును. ఎక్కువకాలము రొంపగాయున్న డాక్టరుకు చూపించవలయును.

(సశేషము)

పి. జె. కాంతమ్మ

# బాలప్రహ్లాద

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

( గత సంచిక తరువాయి )

### 8 వ రంగము

#### హిరణ్యకశిపుని దర్బార్

(మంత్రి సామంత ఆచార్యాది పరివారం జనంతో హిరణ్యకశిపుడు కొలువై ఉంటాడు. సింహాసనాసీనుడైన రాజుకు ఎదురుగా ప్రహ్లాదుడు చేతులుజోడించుకొని నిలబడిఉంటాడు.)

హి॥ ప్రహ్లాద్

ప్ర॥ నాన్నా!

హి॥ నిరంతర విష్ణుసంకీర్తనచే నీవు చెడుతున్నదేగాక రాక్షసబాలురనుగూడ నేర్పుచున్నావట నిజమేనా?

ప్ర॥ నిజమే.

హి॥ అది పిల్లలను చెడుమార్గమున బెట్టుటగాదా.

ప్ర॥ అది చెడుమార్గమైన నేనే అవలంబింపక ఉందునుగాదా.



హి॥ హరిభక్తివిడువవా?

ప్ర॥ విడువలేను, తండ్రీ!

హి॥ నీకు చావుమూడినది. ఈ నిశిత చంద్రహాసంతో నీతలనుత్తరిస్తాను.

ప్ర॥ మహాభాగ్యము. శ్రీహరి నామస్మరణ జేస్తూ ప్రాణములువిడిచి. పునరావృత్తిరహితమైన మోక్షసామ్రాజ్యం చూరగొంటాను.

హి॥ చావనిన భయంలేదా?

ప్ర॥ భయపడితే చావుతప్పుతుందా?

హి॥ హరిభక్తి మానితే చంపనుగాదా!

ప్ర॥ పాంచభౌతికమైనకాయం వేయేండ్లకైనా పోయేదే! ఈ క్షుద్రతనువు కాంక్షించి మోక్షప్రదాయకమైన హరిని భక్తిసేయకుందునా!

హి॥ (పండ్లుకొరుకుచు) ఎక్కడున్నాడురా భగవంతుడు?

ప్ర॥ అంతటను ఉన్నాడు. ఆయనలేని తావున్నదా తండ్రీ?

"కలడంభోధి గలండుగాలి గలడా
కాశంబునం గుంభినిం
గలడగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్
ఖద్యోత చంద్రాత్మలన్
గలడోంకారమునం ద్రిమూర్తుల ద్రిలిం
గ వ్యక్తులందంతటం
గలడీశుండు గలండుతండ్రి వెదకం
గానేల నీయాయెడన్?"

హి॥ ఓరీ మూర్ఖా! పితృద్రోహీ! దానవ సామ్రాజ్య వినాశక! పసిబాలుడవని ఉపేక్షించిన కొలదీ, కన్నకొడుకువని కనికరించిన కొలదీ,



నీదుర్మార్గం మేర మీరిపోతున్నది. [redacted] దైత్యకులవిరోధిని స్మరించుట మానుమని ఎన్నివిధముల చెప్పినా మానకున్నావు నేటితో నీజీవితము సరి. అపై యెవరిని స్మరిస్తావో! ఈ త్రైలోక్య సామ్రాజ్యము నంతను, నా భుజస్కంధమున వహించి పాలిస్తున్నాను. ఆ నిర్జరాధములనెల్ల పెక్కుమార్లు నిర్జించి పారద్రోలాను. నీ హరికింకరులైన వేల్పులనూ, తాపసులనూ, మప్పుతిప్పలు పెట్టినాను. దేవతాస్త్రీల నెందరినో చెరబట్టి నా అంతఃపురంలో చేర్చుకున్నాను. స్వర్గాధిపతియైన [redacted] దేవేంద్రుని కుక్కను తోలినట్టు తోలి వాని దేవేంద్రపీఠం అధిష్ఠించి అప్రతిమానప్రతిభా ప్రతాపసమన్వితుండనై ముల్లోకములం ఏలుచున్నాను. వైకుంఠము పాడుపడినది. వైకుంఠు డేనాడో పరారైనాడు. దిక్పాలకులు దిక్కుమాలినవారై అడవులబట్టి తిరుగుతున్నారు. దేవుడనేవాడులేడు. ముమ్మాటికీలేడు. నేడు త్రిజగములవారు నేనే దేవుడనని అత్యంత భయభక్తులతో నన్నే కొలుస్తున్నారు. ఇంకా ఎక్కడున్నాడురా నీదేవుడు?

ప్ర|| ఇక్కడున్నాడు-అక్కడున్నాడు, అను మాటేమున్నది. ఆచక్రి సర్వోపగతుడు. చరాచరాత్మకమైన యీవిశాల విశ్వమునందంతటను నిండి నిబిడీకృతుడై ఉన్నాడు.

హి|| (పండ్లు కొఱుకుచు లేచినిలబడి ఉరిమి చూస్తూ) అయితే ఈ స్తంభంలో ఉన్నాడా?

ప్ర|| [redacted] హా సందేహమేమి తప్పక ఉన్నాడు.

అంభోజాసను డాదిగాగ తృణ
  పర్యంతంబు విశ్వాత్ముడై
సంభావంబున నుండు ప్రోడ విపుల
  స్తంభంబు నందుండడే
స్తంభాంతర్గతుడయ్యు నుండుటకు నే
  సందేహముల్ లేదని
దంభత్వంబున నేడు గానబడు ప్ర
  త్యక్ష స్వరూపంబునన్.

హి|| అయితే చూపుము (అని స్తంభముపై కత్తితో కొట్టును) (శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమగును. హిరణ్యకశిపుడు పడిపోవును. ప్రహ్లాదుడు శ్రీహరి సంకీర్తన జేయును.)

(తెర)

మంగళం.

# రీటా తలవెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెంట్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనవేలు వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడ తారల ప్రశంసలు

**లలితాపవర్ :** ఉత్తమమైన హెయిర్ టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీ లేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

**సుశీల్ కుమార్ :** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ :** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి :** నాకు సుమారు ఏడాదిగా తలవెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్టమైన హెయిర్ టానిక్ అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనమును చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తలవెంట్రుకలను రాలకుండాచేసి, క్రొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

**లక్ష్మీబాయి:** తలవెంట్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజరక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

**రాజమ్మ :** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుకున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘనీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# నెల్లూరి భక్తులు:

# కీర్తిమూర్తులు శ్రీ పిళ్లారిసెట్టి కోదండరామదాసుగారు

శ్రీ॥ శే॥ వంగోలు వెంకటరంగయ్యపంతులుగారు

(గతసంచిక తరువాయి)

దాసుగారికి భగవద్భజన తత్పరత పైతృకదాయకముగ నున్నది - రంగపతిశతక పీఠికలో వారి యిట్లు దెలిపియున్నారు:—

"పినాకినికి తూర్పుఅంచునకు ఆనుకొనియున్న తల్పగిరి
యందు వేంచేసియుండె రంగనాథుని సన్నిధిలో పరమభక్తుడై
నృత్యము భజన ముప్పై సంవత్సరములుచేయుచు వచ్చి పది
వరాల జీతముగల ఉద్యోగములోనుండిన తండ్రిగారైన
పిళ్ళారిసెట్టి వెంకటస్వామిదాసుగారి వెంబడి నాలు
గైదేండ్ల వయస్సునుంచి ఆ (తల్పగిరి) రంగని సన్నిధికి
వెళ్లుచు వారు చూపించిన ప్రకారము ఉపాయముగా
గజ్జలు కట్టుకొని నృత్యముచేయుచూ తాళము వా
యించుచు పాడుచు..." వర్ధిల్లిరి. వీరిభక్తియు వీరితోటి పెంపొందినది.

వీరేకాదశీవ్రతమును(1) శ్రద్ధతో జరిపిరి. ప్రతిఏకాదశియు శ్రీ స్వామివారి సన్నిధిలో నృత్యగీతములతో కాలక్షేపము జేయుచుండిరి - ఆ వ్రతానుపాలనమునుగూర్చి రంగపతిశతక మిట్లు సాక్ష్యమిచ్చుచున్నది:—

శ్రీ దయితా మనోహర సరీసృపరాజశయాన యెప్పుడే
కాదశి నుంటి ద్వాదశి సుఖంబున పారణగొంటి తత్కథా
స్వాదము పంచ సంస్క్రియలు (2) సాధుజనాదృతి గంటి బ్రోవవే
రా, దయనంటి తల్పగిరి రంగపతీ సుకృతీ కృపామతీ.

శ్రీతల్పగిరి రంగనాయకస్వామి ఆలయగోపురాదుల కట్టించిన పూర్వోదాహృత శ్రీయరగుడిపాటి వేంకటాచలం పంతులుగారును దాసుగారిచే శ్రీకృష్ణలీలాతరంగ భజనము నృత్యగీతాదులతోటి తమయింట అప్పుడప్పుడు జరిగించుచుండినారు.

---

(1) ఏకాదశీవ్రతము త్రిరాత్రదీక్ష. దశమినాడు ఏకవారాశనము - ఏకాదశి శుష్కోపవాసము. ద్వాదశినాడరుణోదయపారణ, ఏకవారాశనము.

(2) పంచసంస్క్రియలు.

(1) తాపః — చక్రాంకనము.
(2) పుండ్రః — తిరుమణి తిరుచూర్ణముతో నూర్ధ్వపుండ్రధారణము.
(3) నామ — వైష్ణవనామము (పేరు)
(4) మంత్రః — తిరుమంత్రము.
(5) యజ్ఞః — వైష్ణవేష్టి.

వీరాంధ్రగీర్వాణ సాహిత్యపటిష్ఠులుగారు. సంగీతవిద్య నెపుడెచట యభ్యసించిరో తెలియదు. హైస్కూళ్లు కాలేజీలులేని యా ప్రాతకాలమున ప్రాయికముగ "పెద్దపుస్తకము"ను చేతబట్టించుటయె పరమావధిగగల పల్లెకూటములె విద్యాస్థానములై యుండినవి. రంగపతీశతకమున నిట్లువారెజెప్పియున్నారు:—

"అమరనిఘంటు లక్షణము నాంధ్రమలంకృతిఁ గావ్యనాటకా
దిమముల నెన్నడైన నియతిం బఠియింపఁగ లేదు; భక్తిచే
విమలపదంబుఁగోరి గడువేడుక సత్పల చంపకంబులన్
రమణ రచింతుఁ దల్పగిరి రంగపతీ సుకృతీ కృపామతీ"

వీరిని కవిత్వమున ప్రవేశపెట్టి యఖిలాగమ విజ్ఞానసంపన్నుని జేసినది శ్రీమాన్ నల్లాని నృసింహాకవి. యని రంగపతీ శతకముననే కృతజ్ఞతా పూర్వక ప్రస్తుతి గలదు:—

"తానొక కామధేనువు విధంబున నాకడ కేగుదెంచి యెం
తో నెనరొప్ప నద్భుతపుధోరణి నాక ఖిలాగమాంత వి
జ్ఞానము గల్గఁజేసిన ప్రశాంతు నృసింహగురున్ దలంతు న
ల్లాని కులోద్ధుఁ దల్పగిరి రంగపతీ సుకృతీ కృపామతీ".

ఇప్పటికి తెలిసినంత వరకును వీర్క్రింద పేర్కొనిన శతకాదుల రచియించినారు. వీనినన్నిటిని తమ జీవితకాలముననే అచ్చువేయించి విరివిగ బంచిపెట్టినారు. ప్రాతకాలపు పల్లెకూటములలో రుక్మిణీకళ్యాణ గజేంద్ర మోక్షములు వల్లింపబడుచుండినటుల దాసుగారి జీవద్దశయందును తదనంతరము కొంతకాలము దనుకను వల్లెవేయబడుచుండినవి. వానియందు వీరు కాపీరైటు హక్కునుగూడ నాశింపక వానికి లోక వ్యాప్తి కలుగుటకై ఇతరులుకూడ నచ్చువేయించు కొనవచ్చునని అనుజ్ఞసాటించిరి. అందుచే వీరిరచనలు కొన్ని ఇతరులచేతగూడ నచ్చొత్తింపబడి యున్నవి.

వీరికవిత్వమున నగపడు ఛందోవ్యాకరణాది దోషములచే వీరిగ్రంథముల నిరసింపక కవిసమయ సిద్ధములుగ నాదరింపదగియున్నవని మనవి. అట్లని వీరు వ్యాకరణ నియమముల నెఱుంగని వారనుకొనుటకు వలనులేదు. కొన్నియెడల నర్ధానుస్వారములును లఘుశకట రేఫభేదములును యడాగమములును పరుషసాన్ధ సరళములును క్రమముగనే కనబడుచున్నవి. స్ఖాలిత్యములు కొన్ని లేఖక ప్రమాదములును అచ్చుకూర్పువ నేర్పడినవిగను యుండవచ్చును. వీరిరచన మృదువుగను మనోహరముగను నుండును. వచోగతి కొఱుకు లేకుండ పాఠకుని కడ్డుపడకుండ సరళముగ నడచును. వీరు అనేక పురాణాదుల లెస్సగ జదివినటుల వీరి గ్రంథములవలన తెలియవచ్చుచున్నది. కాలములలో ఉప్పు యిలాకా, అబ్కారియిలాకా, మేజిస్ట్రీటు యిలాకా అన్నిచేతుల నిండియుండు రివిన్యూ యిలాకా తహసీల్ దారునికి యిన్నిగ్రంథముల పారాయణము జేయ నవకాశమెట్లు గలిగెనో, వీరి భజనలు ఏకాదశీ వ్రతములు ఎట్లుసాగినవియో ఆశ్చర్యముగనున్నది. వీరు శ్రుతధరులుగ నుండియుందురు. వీరి రచనలందు భక్త్యావేశము కనుపింపగలదు. అతిభక్తి పారవశ్యమును దెలుపును. వీరికవిత్వమున తెలుగు భాగవతము యొక్కయు దాశరథీశతకము, వేణుగోపాలశతకము లోనగు లోకప్రియంకరములగు గ్రంథములయు పోకడలందందు గానవచ్చును. ఇంతమాత్రమున నట్టివానిగ్రంథ చౌర్యములనరాదు. ఒకానొక ప్రాచీన లాక్షణిక ప్రవరుడు "నాస్త్యచోరః కవిజనః"యని యుపదేశించి యున్నాడు. కవితాలాలిత్యముచేతను అందలి యాదరణచేతను పరిచయాతిశయముచేతను అన్యకవి ప్రయో

గము అవశముగ దొరలివచ్చుచుండును. (1) మహాకవులగు కాళిదాస భవభూత్యాదుల కావ్యనాటకములందు లెక్కకు మిక్కిలిగ మహాకవి భాసోక్తులు కనుపడుచున్నవి. (2) కాళిదాసుని రఘువంశము అశ్వఘోషుని బుద్ధచరితము (3) ననుకరించుచున్నదనువారుగలరు.

భక్తులకు భక్త్యావేశమున వచ్చువాక్యములు ఛందోబద్ధములుగను గీతములుగను యుండును. మహాకావ్యములను వ్రాయువారివలె వీరు దీక్షబూని ఘంటము తాటాకు చేతబూని వ్రాయనక్కరలేదు. ఆవేశ ప్రవాహమున వీరినోట వచ్చునదంతయు పద్యరూపముగనో పాటవలెనో యుండును. కొంతసవరణ కావలసి యుండుట సహజముగ నగపడుచున్నది.

---

(1) రామాయణ యుద్ధకాండలో 102.7 లో "అవసీదన్తి గాత్రాణి" అని యున్నది, భగవద్గీత 1.20 లో "సీదంతిమమగాత్రాణి" అని యున్నది. వ్యాసవాల్మీకులలో నెవరిది చౌర్యమనగలము ?

(2) తే 3-1.49, 17.1.49, 24.1-49 దుల త్రిలింగ పత్రిక జూడుము.

(3) నందర్గికరు ప్రకటించిన రఘువంశ పీఠికం జూడుము.

# నవ్వు

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు.



నవ్వు. దీనికిరూపంలేదు. కాని! నామంమాత్రంవుంది. రూపరహితమైనా నామం శబ్దాన్నిబట్టి వచ్చిందనుకుంటాను. నవ్వు నానా విధాలు. విధాలే కావుసుమండీ; అందులో నానా భావాలుకూడా యిమిడివున్నాయి.

వెగటునవ్వు, విసుగునవ్వు, వింతనవ్వు, నిస్పృహనవ్వు యీలాగే అనేకవిధాలు. యీనవ్వుని కండ్లల్లోనేప్రదర్శించేవారు, కాస్త పలువరుస కనబరచేవారు, పెదవులు విప్పీవిప్పకా నవ్వేవారు, కొద్దిశబ్దంతో నవ్వేవారు, సాధారణంగా కొంతదూరం వినబడేశబ్దంతోటి దేహమాద్యంతంకంపింపజేసి త్రిస్థాయిల్లో మేళవించి చివరకి గమకంతోటి మందరంలో కలిపే మహనీయులు మరికొందరున్నారు. యీలాగే రకరకాలు మనం చూస్తూనే వున్నాంకదండీ.

ఈ నవ్వులకు వేరువేరుపేర్లుపెట్టినారు మనవాఙ్మయకర్తలు. స్మితము, హసితము, దరహసితము, మందస్మితము, అట్టహాసము ఇత్యాది. ఆయాశబ్దాడంబరాన్ననుసరించి పురాణ, కావ్యకర్తలు యీనవ్వును వర్ణించి పోషించారు. అయితే యీనవ్వుఅనేశబ్దం యెప్పుడుపుట్టిందా, అని ఆలోచిస్తే అనాదిగా యిదీ భగవంతునిలోనుంచే ఆవిర్భవించిదిలా కనుపిస్తుంది. ఎందుకంటారా? నారాయణమూర్తి చిరునగవుచిందులాడే ముఖం గలవాడని వర్ణించారు. దేవిని "దరహసిత వదనారవింద" యనిపేర్కొన్నారు. మహాఋషులు. శంకరుడు వికటాట్టహాసము చేసినట్లు అందులోనుంచి యేవేవోశబ్దాలు పుట్టినట్లు వ్రాశారు మనశబ్దశాస్త్రవేత్తలు.

చిరునవ్వుచిందులాడే ముఖాన్ని చూస్తే ప్రసన్నవదనం అంటాం. ప్రసన్నవదనంగ అధికారితో పరివారం తమకష్టసుఖాలు ధారాళంగాచెప్పుకుంటారు. భార్యతనకోర్కెలన్నీ యేకరువుపెట్టేస్తుంది. (ఫలితంమాట ఆలావుంచండీ) మరి పిల్లలు చిన్నచిన్న మాటలతో యెన్నో అవ్యక్త మధురమైనకబుర్లు చెబుతారు. నగుమోము వున్నమాత్రంతోటే నలుగురికోర్కెలు తీర్చేస్తారనికాదు. ఆసమయంలో కఠోరమైనమాటవెలువడదనే నమ్మకం యితరులది.

ఈ నవ్వు అనేది అకారణంగా యెవ్వరకీరాదు. అకారణంగానవ్వితే వెఱ్ఱివాళ్ళంటాం. యిక చంటిపిల్లలు యీకారణంలేనినవ్వును కనపరుస్తారు. నవ్వునకు అనేక కారణాలున్నాయి; వింతలూ, వినోదాలుచూచినప్పుడూ, ఆనందం కలిగినప్పుడు, మరికొందరు

యితరులకవమానం కలిగినప్పుడూ,—అంటే కాస్త కాలుజారినప్పుడు-చప్పునచేతులుతట్టి నవ్వడం. తరువాత వ్యక్తినిబట్టి సానుభూతి చూపుతారుగూడాను.

సమయసందర్భాన్ని గమనించి నవ్వునుగూడా జాగ్రత్తగా వుపయోగించుకుంటే శ్రేయమేమోఅనుకుంటాను. లేకుంటె పెద్దపెద్దఅనర్థాలకు దారితీస్తుందంటె పూర్వపక్షం వుండదు. నవ్వులో నానా భావాలు ఇమిడివున్నాయి. పెదవి విరిచినవ్వడం నీరసానందాన్ని నిరూపిస్తుంది. తలవూపుతూనవ్వడం యీప్సితార్థసిద్ధిని పొడసూపుతుంది. ఫెళఫెళార్భటులలో మెరుపుల్లా నిరాశాపూరితమైన వేసినిట్టూర్పుల్లో వెగటునవ్వు కాలికి వస్తుంది. ఇందు చేతనేసుమండీ నవ్వ నానార్థాలాచెరువటారు మనపెద్దవారు. ఆనందసూచకమగు నవ్వు అనర్థదాయకంయెలాగా? అనివిచారిస్తె చూడండీ!—రావణవధానంతరం శ్రీరామ చంద్రుడు వామాంకమున భూసుతతో సుగ్రీవ, విభీషణాది వానర రాక్షస సర్వఋషి సమేతుండై నిండుకొలువులో వున్నప్పుడు లక్ష్మణుడు నవ్వినన్వు యొందరకో యెన్నో అనర్థాలుగాతోచింది. నిజానికిఆనవ్వు యేకారణంకాదు. రాముడు చెరబోయిన సీతను తెచ్చుకున్నానని నన్ను చూచినవ్వినాడేమో ననుకున్నాడు విభీషణుడు నన్నుజూచేమో అనీ యీలాగే పలువురు పలువిధాలాను. ఇక మయసభలో దుర్యోధనమహారాజు కాస్త కాలుజారినప్పుడూ ద్రౌపదినవ్విన చిన్ననవ్వే పెద్ద భారతయుద్ధానికే మూలమైయింది. ఇందుకే మనవారు ఆడవారు పదిమందిలో పలువిచ్చి నవ్వరాదన్నారు. అంతటికాగక మందస్మితమే స్త్రీలకు యోగ్యమని నొక్కిచెపుతూ నవ్వునానార్థాలా చెరువని తర్జని చూపించారు.

గృహలక్ష్మియొక్క ప్రశాంతహృదయమే గృహరాజ్యశాంతి భద్రతలకు ముఖ్య కారణము. గృహరాజ్యతంత్రములు ప్రశాంతముగానడుపుటయే గృహలక్ష్మి కర్తవ్యము. అందుకే ఆయమకు మంత్రిస్థానముఇచ్చారు. గృహలక్ష్ములు కాబోవు బాలికలు అన్నికళల తోటి దీనినీ గ్రహించి మందస్మితవదనారవిందలై వన్నెకెక్కుదురుగాక.



# నిర్మల ★ ★ ★ గోలేటి శ్రీ జగన్మోహనరావుగారు

(గతసంచిక తరువాయి)

"కబ్బన్ పార్కు" లో అతను పాలరాతిమీదకూర్చుని నిశ్చలమైన ప్రకృతిరహస్యాన్ని తెలుసుకో డానికి ప్రయత్నిస్తూన్నట్టుగా నిర్మలంగా చూస్తున్నాడు. మనోహరమైన చెట్లనీ, ఆచెట్లమధ్యనుంచి తొంగిచూసే చందమామనీ......ఆకాశం ఎంతో రమ్యంగావుంది వివిధవర్ణాలతో......కొంతసేపటికి దృష్టి క్రిందకిదించాడు......ఒక్కసారి ప్రశాంతంగా కళ్ళుమూసుకున్నాడు ... అమాంతంగా ఒళ్ళు జలదరించింది. నిర్మల అన్నమాటలు మళ్ళీ జ్ఞప్తికివచ్చాయి. ఆలోచన్లు శరవేగంతో పటిగెడుతున్నాయి బుజ్జిచుట్టూ...తలక్రిందికిదించి ఆలోచిస్తున్నాడేదో గాఢంగా ... ఉన్నట్టుండి గడియారంమీదకెళ్ళాయి దృష్టులు. "అబ్బా! ఎనిమిదయింది!" అని మెల్లిగా అనుకుని ప్రయాణమయ్యాడు "రూం" వేపుకి ఇరవైనిమిషాల్లో ఒక ఉన్నతభవనందగ్గిరికొచ్చి ఆగాడు ... లోపలికెళ్ళి తనగదితలుపు తీసుకుని మంచంమీద వాలాడు కళ్ళుమూసుకుంటూ. ఆ గదికని అతను ఎన్నికష్టాలుపడ్డాడో బ్రహ్మకేతెలియాలి. ఆభవనం ఒక గొప్పపెద్దమనిషిదనీ, అతను బొంబాయి కాపరస్తుడనీ, వేసంగిలోమాత్రం బెంగుళూరువచ్చివుండడానికని ఆమేడకట్టించాడనీ తెలుసుకుని అక్కడి కాపలాగుమాస్తాకి చెయ్యరానిసేవచేసి ఆపెద్దమనిషికి వ్రాయింపించి, ఆగది అద్దెకివ్వడానికి అనుమతితెప్పించుకోవడాని కతని తాతలుదిగొచ్చారు ... ఎలాగైతేనేం "రూం" సాధించాం అని చాలాగర్వపడ్డాడు మనోహరం. అప్పుడే. వేసవికాలంవచ్చింది... సాయంత్రం ప్రతిరోజూ పార్కుకిపోయి కూర్చుని వస్తూండటం అలవాటుచేసుకున్నాడతను—అవాళరాత్రి అక్కడిగుమస్తా, బంట్రోతులూ చాలాహడావిడిగా వున్నారు. ఇక్కడి సామాన్లక్కడా అక్కడి సామాన్లిక్కడా సర్దుతూ. మనోహరానికి నిద్రపట్టటంలేదు, విసుక్కునిలేచికూర్చున్నాడు మంచంమీద. "ఈ హంగామాఅంతా యజమానిగారొవస్తారని కామోసు...అబ్బ! ప్రాణాలుపోతున్నాయి వెధవ చప్పుడు." అనుకుని మళ్ళీ మంచంమీదపడుకుని దొర్లటం ప్రారంభించాడు ... నిద్ర ఎప్పుడుపట్టిందో అతనికే తెలియలేదు...

మర్నాడు సాయంత్రం మళ్ళీ పార్కులో తయారయ్యాడు మనోహరం. కొండశిఖరంఎక్కి చుట్టూ చూశాడు ... అబ్బ! తను ఎంతఎత్తుమీదున్నాడు! పట్టణంలో యిళ్ళన్నీ అక్కడక్కడ పరిచిన చిన్న చిన్న వస్తువుల్లా కనిపించాయతనికి. అయిదునిమిషాలు అక్కడనేనుంచుని క్రిందకిదిగడం ప్రారంభించాడు. చాలాసన్నమెట్లు. మెల్లిగా జాగ్రత్తగా దిగుతున్నాడు. కొన్ని గజాల దూరాన్ని ఒకఅమ్మాయి, చిన్న పిల్లాడూ...ఇద్దరూ మెట్లెక్కి పైకివస్తున్నారు. "ఆ అమ్మాయి ఎంత అందంగావుంది! సౌందర్యం అంటే యిదేకదూ" — ఏవో పిచ్చి పిచ్చి వూహలు బయల్దేరాయి మనోహరం హృదయంలో. అలాగే మెట్లుదిగుతున్నాడు ... వచ్చింది ఆ అమ్మాయి చాలాదగ్గిరకొచ్చింది .. మనోహరాన్ని చూసింది. రెప్పలు రెపరెప కొట్టుకున్నాయి...ఒళ్ళు గగుర్పొడిచింది...కాళ్ళు తడబడ్డాయి...వళంతప్పినట్లు కనిపించింది...ఈస్థితిలో పిల్లాడిని జాగ్రత్తగా నడిపించాలన్న సంగతి మరిచిపోయిందా అమ్మాయి...పాపం పిల్లాడికాలుజారింది. రెండుమెట్లు క్రిందకిదొర్లాడు ... గుక్కతిరక్కుండావుంది ఏడుపుతో—మనోహరం వెంటనే అతణ్ణి పట్టుకున్నాడు ··· లేకపోతే ఆపిల్లాడు యింకా పదిమెట్లు దొర్లిపోవలసినవాడే ... నయం, వాడికి దెబ్బలేవీతగల్లేదు. కాస్సేపు గుక్కపట్టి అక్క వూరుకోపెడితే కొంచంవెక్కడం ప్రారంభించాడు. "ఎంతో కృతజ్ఞురాల్నండీ ... మా తమ్ముణ్ణి" అంటూ మళ్ళీ భాషమార్చి ఇంగ్లీషులో చెప్పడం మొదలెట్టిందా అమ్మాయి.

"మాభాష తెలుగేలెండి ... అయినా కృతజ్ఞత చూపించటానికి నేనుచేసిన ఘనకార్యం ఏంవుందీ?"

"అలా అనకండి ... మీరు లేకపోతే మాతమ్ముడిగతి ఏవయేదో"

"నేను లేకపోతే మీతమ్ముణ్ణి జాగ్రత్తగా నడిపించుందు రేమో!"

ఆ మాటలు ఎందుకన్నాడో అతనికే తెలియదు.

ఆ అమ్మాయిముఖంలో కొంచం చిరునవ్వే దానికిసమాధానం.

ఒక క్షణం నిశ్శబ్దం ... మనోహరం ఈసారి ఆ అమ్మాయిలోకి చూశాడు ప్రశాంతంగా. ... ఏదో ఎలక్ట్రిక్ షాక్ లాగ తగిలిందతనికి! అమ్మాయిముఖం పరిచితమైనదానల్లే కనిపిస్తోందే ... ఎవరు? అన్నగి అతని హృదయం యింకా నిర్ధారణ చెయ్యలేకపోయింది. ఇదంతా మరోక్షణంలో జరిగింది.

"అయితే మీరు తెలుగువాళ్ళే నన్నమాట?" మెల్లిగా అడిగాడతను.

"మరేనండి... ... ..."

"బెంగుళూరేనా మీనివాస స్థలం?"

"కాదు, అప్పుడప్పుడు వస్తూంటాం..."

"నాప్రశ్నల్తో మిమ్మల్ని విసిగించటంలేదుకదా ... ఈ వూళ్ళో స్వచ్ఛమైన తెలుగుమాట్లాడేవాళ్ళు వచ్చినాదొరకరు ... అందుకని మనవేపువాళ్ళు కనిపిస్తే ఏదోచెప్పలేనిసంతోషం..." చాలాదూరం వెళ్ళిపోతూన్నట్టనిపించిందతనికి ... అక్కడితో ఆపించాడు.

"అవును ... ఎప్పుడేనా మాయింటికిరండి మానాన్నతో మాట్లాడొచ్చు ... ఆయన తెలుగుసంఘం ఒకటి యిక్కడ స్థాపించడం విషయంలో వచ్చినప్పుడల్లా కృషిచేస్తూంటారు."

"చాలా సంతోషంగావుంది ... తప్పకుండావస్తా... మరివెళ్తా ..."

పెద్దబోనులోంచి యివతలపడినట్టుంది మనోహరానికిప్పుడు. ఎవరు అమ్మాయి? ... ముఖం పరిచితమైనదానిలాగేవుంది ... ఎవరు చెప్మా ... మనస్సు అనేక చీలికలైపోయింది ... అన్ని చీలికలూ పరిగెట్టాయి తలోవేపుకీ ... తనకు తెలిసిన ప్రతిస్త్రీనీతెచ్చి అతనిముందర నిలిపాయి ... ఆ ... తెలిసింది! నిర్మలకదూ ఆ అమ్మాయి...ఈమాత్రం జ్ఞాపకం చేసుకుందుకింతసేపా? ఎంతమారింది నిర్మల! ... అవును అయిదేళ్ళమాట...మారదేవిటిమరి ...తనుమారిపోలేదూ...ఇంతట్లో గుండెల్లో ఏదోదడ...నిర్మల!...నిర్మలైతే అలామాట్లాడుతుందా...అంతప్రశాంతంగా—అలా అర్థసహితంగా నావైపుచూస్తూ! ... ఎన్నటికీకాదు... ముమ్మాటికీ అమ్మాయి నిర్మలకాదు ... నిర్మలైతే మరికూడా ఆ అబ్బాయి ఎవరు? తమ్ముడు... అవును ఎందుకు పుట్టివుండకూడదూ? అయినా నిర్మలకీ బెంగుళూరికీ ఏం సంబంధం? ఏమో ... అయిదేళ్ళ మాట! పరిస్థితులు మారవేవిటిమరి! ... తనెందుకొచ్చాడు బెంగుళూరు? ఏవిటో మళ్ళీ అంతా అయోమయంగావుంది...!! ... "నిర్మలనాతో అంత మృదువుగా మాట్లాడదు...ఆ అమ్మాయి నిర్మలకాదు... అని ఘట్టిగా నిశ్చయించుకున్నాడు ... అయినా ఏదోఅనుమానం పరుగులెత్తుతోంది అటూ యిటూ ... పోనీ వాళ్ళింటికి వెళ్తాంగా ... ఆ అమ్మాయితండ్రిని చూస్తే అంతా తెలిసిపోతుంది. ఎంతమారినా ఆయన్ని ఆనమాలుపట్టడం చాలాసులువుగా కనిపించింది మనోహరానికి. "రేపు వాళ్ళింటికెళదాం" అనుకున్నాడు. అడ్రసు? అని ప్రశ్నించింది మనస్సు! అరరే! — ఎంతమూర్ఖుడు తను — ఎడ్రసు తీసుకోవటం మరిచి పోయాడు! ఇంతా ఆలోచించిందంతా బూడిదలోపోసిన పన్నీరే? మళ్ళీ ఆ అమ్మాయి అతనికి కనిపిస్తుందన్న నమ్మకం ఏవిటి? కనిపించటం వట్టిమాట ... పోనీ గబగబా మళ్ళీవెళ్ళి ఆ అమ్మాయిని కలుసుకుని అడ్రసు అడిగితే...ఛా! అంతకన్నా నీచపుపని మరోటివుండదు ... ఈ ఆలోచనల్లో "రూం" చేరుకున్నాడానాడు. ఆ రాత్రి నిద్రపట్టలేదుపాపం.

(సశేషము)



# ఆదర్శజీవి ఆనీ బెసంటు

ఆనీ 1-10-1847 తేదీని ఐరిష్ దంపతులు ఎమిలీ మోరిస్, విలియమ్ బర్టన్ పెర్సీ ఉడ్‌లకు జన్మించిన ఏకైకపుత్రి. ఈమె జన్మవేళా విశేష మెట్టిదో గాని, యీమెకు పట్టుమని ఎనిమిది వత్సరములు ప్రాయము రాకమునుపే పితృ మారకము గలిగినది. మాతృ శరీర దార్ఢ్యము మందగించినది. ఎమిలీకి, బోధా సహనము, కార్యదక్షత, వెన్నతోపెట్టిన విద్యలు తల్లిని మూడుమూర్తుల బోలిన ఆనీలో యివి వెన్నెముక వరకు వేళ్లుదన్ని మూర్తీభవించినవి. బాల్యమున ఆనీ ప్రాయమునకుమీరిన ప్రౌఢిమ గరిమ గలది. ఆమెచదివిన పాత్రములకు లెక్కలేదు. కాలమునకు పరిమితిలేదు. ఆమెపుస్తకపఠనమున నిమగ్నమైనపుడు, మాతృదేవి మందలించి ఆటలకు సాగనంపినగాని పుస్తకమును ముడిచి గృహమును వీడునదిగాదు. ఆమె పంట్లాము ధరించి తోడి బాలురతో క్రికెట్ ఆడెడిది. చెట్లకెగ బ్రాకెడిది. ఆమె నల్లని గండుతుమ్మెదల బోలు ఉంగరముల కురులు, దేదీప్యమానమయిన హరిణీ నేత్రములు సహజ లావణ్యమునకు నైగోడయినవి ఆమె అందమునుజూచి ఆమోదించని వారును, చంపమును జూచి జోద్యపడని వారును లేరు. ఆమెతల్లి ఆమెకిడిన ప్రేమాస్పదమగు నామము 'సూర్యకాంతి'కి ఆనీ. బైబిలు పైభక్తి శ్రద్ధలు మెండు, జీసస్ అనిన అపరిమితమైన ప్రేమ. ఆమె యింగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సు మున్నగు దేశములు తిరిగి, ఇంటగూర్చుండి చదివి అపరిమిత విద్యనార్జించి వంట బట్టించినది.

ఆనీకి బాల్యము తొలిగి యౌవ్వన మంకురించినది. ప్రకృతి ధర్మాను సారముగ 1867 సంవత్సరమున, తన యిరువదవ యేట రెవరెండు ఫ్రాంకు బిసెంటు గారితో పాణిగ్రహణ మహోత్సవము జరిగినది. వరునకు లోకజ్ఞానములోటు. సంసారమును పోషించు బాధ్యత సమయస్ఫూర్తికైనను లేదు. దాంపత్య ధర్మానుసారముగా ఆనీకి, ఒకకొమరుడు, ఒక కొమరిత జన్మించిరి. సంసారబాధ్యతతో నామె 'లేడీ బౌంటిఫుల్' అను నాటకమును గ్రామస్థులకై ప్రదర్శించుచుండెడిది. తనతీరిక సమయములలో 'డెయిలీ హెరాల్డు' కు వ్యాసములు వ్రాయుచుండెడిది. ఆసమయమున తన జీవనజ్యోతి కొమరిత 'మేబెల్' శరీరమస్వస్థతగ నుండెడిది. ఒకదినమున రోగి బ్రతుకునను ఆశ వైద్యునకు సహితము స్ఫురించినది గాదు. భగవంతుడు దయార్ద్ర హృదయుడా, కాడా? అన్న సంశయ మామె యమాయిక హృదయమును కలచి వేసినది. కుమార్తెపై ప్రేమ, భర్తమందమతనముకై మనోవేదన, తన మొరాలకింపమికి భగవంతునిపై క్రోధము యొక్కుమ్మడి హృదయమును బాధింప నాయమ రోగిని విడచి మేడపైకి పరుగిడి వత్తుమందు త్రాగి మడియుటకై యత్నించెను. కాని, ధైర్యముచాలక విఫలమనోకృతియై మూర్ఛనొందెను. "పిరికిపందా! కొలది కాలము కష్టములు సహింపలేని దానవు నీకేమి లోకోపకారము చేయ" గలవను యంతర్వాణి నుడువులు, జ్ఞానప్రబోధమును గల్గించి ఆమె హృదయ ఫలకమున చిత్రింప బడినవి.

♦ ♦ ♦

సైకతస్థలమున నిర్మింపబడ్డ మహాసౌధమువలె ఆనీ వివాహబంధ మారేండ్లలోనే యంతరించినది. 1873 వ సం॥న నామె విడాకులు పుచ్చుకున్నది. గృహస్థధర్మమున ఆనీ "కన్యకు యుక్తాయుక్త జ్ఞానము కలుగక మునుపే వరుని యోగ్యతాయోగ్యతలు పరిశీలింపక మెడవిరచి పెండ్లి చేయుటకన్న పెద్దతప్పిదముతే" దని స్వానుభవమున చాటిచెప్పినది. 'నా' అను వారులేని విశాల ప్రపంచమున నేకాకిగా తనపాత్రిల్లలోని పనికంపు, నిత్యగండము నూరేండ్లాయువుగల మేబిల్‌తో తన జీవయాత్ర సాగించినది,

అనీ. చిన్నచిన్న కథలు వ్యాసములు పొత్తము రూపమున ప్రకటించి, విక్రయించి అందువచ్చు స్వల్ప లాభమున నుదరపోషణ మొనర్చుకొనిన దాయువిద. ప్రకృతిలో నుదర నిమిత్తమొకజీవి మరియొకజీవి నాశ్రయించుట నీచముగ పరిగణింపబడును. పశుపక్ష్యాదులలో సహితము లేనపుడు ఉత్కృష్ట జన్మగా పరిగణింపబడు మానవమాత్రుల కదేల కరతలామలకీను కాకపోవునను సిద్ధాంత మీమెది.

అనీ 1874 సం॥న నేషనల్ శక్యులర్ సొసైటీలో సభ్యురాలుగ జేరెను. ఆమెజీవిత నాటిక ద్వితీయాంకము చార్లెస్ బ్రాడ్లాగారి పరిచయముతో ప్రారంభించినది. అతడు ఫ్రీ థాట్ అందు రాడికల్ మువ్మెంటును నడుపుచుండెడివారు. అతనికి సంఘము నెదుర్కొనుటయన సంతోషము. ఆమె సంఘపరిత్యక్త. అతనిది అమూల్య వాగ్ధోరణి. ఆమె వక్తల శిరోమణి. అతడు పత్రికా సంపాదకుడు, ఆమె అమూల్య వ్యాసరచయిత్రి. అందువలన వారల యన్యోన్యానురాగ మచిరకాలమున నభివృద్ధి పొందినది. వారిరువురును సంఘ మాన్యమగు కరపత్రమును ప్రకటించినందులకై శిక్ష విధింపబడి కైదులో నుంపబడిరి. విచారణ దినమున అనీర్ఝరీ తుల్యమగు వాగ్ధోరణిలో సుమారు 40, 000 మాటలుగల వాఙ్మూల మొసంగినది. న్యాయాధిపతి నివ్వెరపడెను. వకీళ్లు వాక్కు మెదల్పలేదు. సభ్యులు స్తబ్ధులైరి. వ్యాజ్యము ధాత్యములో కొట్టుకొని పోయినది.

అనీ అసంఖ్యాక, అపూర్వగ్రంథ రచయిత్రి. పది సంవత్సరములలో 51 పుస్తకములను రచియించినది. ఆమెరచియించిన లా ఆఫ్ పాపులేషన్ 50,00,000, ప్రతులు, ఫ్రూట్స్ ఆఫ్ ఫిలాసఫీ 1,85,000 పుస్తకములు అచ్చుపడుటతోడనే అమ్ముడు పోయినవి. ప్రపంచమంతటనుండియు వాటి ప్రాశస్త్యమును వేనోళ్ళ కొనియాడుచు, అయాచితముగ యోగ్యతా పత్రములువచ్చిచేరినవి. పురుషులలో సైతము, వేళ్ళపై లెక్కింపవీలగుసంతాననిరోధకప్రచారకులుండు దినములలో నామె యీసమస్యను ప్రజలకు బోధించి బ్రిటిష్ ప్రజలలో వేయికి 36. 3 నుండి 16. 7 వరకు వుత్పత్తి తగ్గించి నందులకీమెదే అగ్రతాంబూలము.

అనీకి కష్టములంతటితో గట్టెక్కలేదు. బెసెంటు తన కుమార్తె మెబెల్ ను తల్లి సంరక్షణమునుండి

సంగ్రహించుటకై న్యాయస్థానమున వ్యాజ్యము తెచ్చెను. న్యాయాధిపతి "ఈమె ప్రవర్తన స్త్రీలోకమే యేవగించుచున్నది. కనుక బిడ్డపోషణా బాధ్యత యీమెకీడుట కూడ"దని ఆనీకి ప్రతికూలముగా తీర్పు చెప్పెను. ఆమెకు మరల నొకసారి యంధకార మావరించినది. రోగముతో పోట్లాడి దక్కించుకున్న తన కుమార్తెను భర్తబారినుండి దక్కించుకొన లేకపోయినది. నవమాసములు కనిపెంచిన స్త్రీలకు కడుపున బుట్టిన నిసుగులపై నెంతయధికార మున్నదో గ్రహించినది. ఆమెకు మతి స్వాధీనము తప్పినది. ఆమెయొనర్చు చేష్టలు యామెకే యర్థము కాలేదు. కారణములేకనే చార్లెస్ బ్రాడ్లా సంబంధము వీడి ఆనీ "ఫేబియన్ సొసయిటీ"లో చేరినది. సభ్యులలో సంక్షోభము బయలుదేరినది. ఆనీ యున్మత్తయాయెను సందియ మందరి హృదయముల నావరించినది. నాటి యామె జీవిత వృత్తాంతము కవులకు కథావస్తువుగా గాన్పించినది. జనరల్ మెస్ అను పండితుడు ఆమెను గురించి యొకచక్కని కావ్యము 1888 లో వ్రాసి 1889 లో ప్రకటించెను.

◆ ◆ ◆

ఆనీ, మేడమ్ బలవట్స్కీ గురుత్వమున 1889 లో దివ్యజ్ఞాన సమాజమున జేరెను. తదుపరి హిందూ యోగి 'చక్రవర్తి' శిష్యత్వము నొంది యోగమభ్యసించెను. తన బ్రాహ్మణగురువుతో ఆనీ 16.11.1893న హిందూదేశమునకు విచ్చేసి గంగాస్రవంతి దరినున్న 'శాంతికుంజ' మను నాశ్రమము నెలకొల్పెను.

ఆనీ హిందూ మతమును స్వీకరించెను. ఆమె నామధేయము 'అన్నాబాయి'గ మారెను. ఆమె మునగని నదులు, గ్రుంకని తీర్థములు లేవని చెప్పుట అతిశయోక్తి కాదు. ఆమెను దేవాలయపు ఏనుగులపై నెక్కించిరి. పల్లకీలతో పట్టిరి. ఉత్సవములలో నూరేగించిరి. సరస్వతీ అపరావతారముగ కొనియాడిరి. హిందూమాతగా స్వీకరించిరి. ఎందరెన్నదగని అంతఃపుర స్త్రీలు సహితము ఆమె దర్శన భాగ్యమునకై ఉఱ్ఱూతలూగిరి. ఆమె కాశీరాజు సహాయమున 1898 లో 'కేంద్ర హిందూకళాశాల'ను స్థాపించెను. 1904 లో 'కేంద్ర హిందూ బాలికాపాఠశాల'ను నెలకొల్పి డాక్టర్ ఆఫ్ లిటరేచర్ అను బిరుదమును బడసెను. ఆమె 1907 లో 'కల్నల్ ఆల్కాట్'గారి యనంతరము దివ్యజ్ఞాన సమాజాధ్యక్షత వహించెను. 1909 సం॥న తన కార్యదక్షతతో కాయకష్టమునకు సరకు చేయక 45,000

మైళ్ళు ప్రయాణము చేసినది. 1910 లో మదనపల్లిలో 'జిడ్డు కృష్ణమూర్తి,' యతని తమ్ముడగు 'నిత్యానందు'ని తన వశము చేసి కొనినది. ఆమె పదునొకండు వత్సరముల ప్రాయము గలిగి, కృశించిన పలుచని శరీరముగల కృష్ణమూర్తియందు, అనాడే ప్రపంచ గురువును దర్శించినది. ఆసందర్భమున నామె పడినపాట్లు వర్ణింప నలవికాదు. కృష్ణమూర్తి తండ్రి తెచ్చిన వ్యాజ్యము ప్రీవీకౌన్సిల్ వరకుపోయి నెగ్గవలసి వచ్చినది. ఆమె సభాధ్యక్షత వహించిన నాటనుండి వరుసగ 1914, 1921, 1928 లో జరిగిన యెన్నికలలో నాయుమయే యుత్తీర్ణ యయ్యెను.

1915 లో హోమ్ రూల్ మువ్‌మెంటును 'లోకమాన్య గంగాధర తిలక్' 'మహాత్మా కరమచంద్ గాంధీ' గార్లతో నేకీభవించి, ప్రారంభించి విజయవంతముగ కొనసాగించినది. అందువలన 1917 జూనులో మదరాసు ప్రభుత్వముచే నీమె శిక్షింపబడి నిర్బంధింప బడినది. ఫలితముగ దేశములో చెలరేగిన సంక్షోభమును మాన్పనామెను మూడుమాసములలోనే విడుదలజేసిరి. ఆమెచేసిన దేశసేవను గుర్తెరింగి ప్రజలు 1917-18 కలకత్తాలో జరిగిన 'అఖిలభారత జాతీయ మహాసభకు' అధ్యక్షురాలిగ నెన్నుకొనిరి.

ఈమె రచించిన పొత్తములు లెక్కకు మిక్కుటము. అవిసుమారు 346 ఉండునని యిటీవల అంచనా వేయబడినది. అందు, ఎక్కువ లోకోపయుక్తమయినది, 'సనాతనవిద్య'. ఆమె సంపాదకత్వమున న్యూ ఇండియా వీక్‌లీ, అండు హోమ్‌రూల్ అను పత్రికలు వెలువడినవి. 1929 లో చికాగోలో జరిగిన నానాదేశ దివ్యజ్ఞాన సమ్మేళనములో ఆమె యొసంగిన 'ముక్తద్వార' మను యుపన్యాసము ప్రశంసాపాత్రమై పుస్తక రూపమున వెలువడినది. ఈయమ సంస్కృతము నేర్చి భగవద్గీతను ఇంగ్లీషులోనికి తర్జుమా జేసినది. 1930 లో యీమె ఆరోగ్యము చెడి యూరప్ నుండి తిరిగి హిందూదేశమునకు వచ్చెను. జన్మించినది క్రైస్తవ మతములో. చేబట్టినది మతగురువును. యోగమభ్యసించినది హిందూ సన్యాసిదరి. వెలసినది దివ్యజ్ఞానములో. యీధ్రువతార, 20-9-1933న అస్తమించినది.

క్రీ॥ శ॥ 1600 సం॥ 'గ్రియార్డినో బ్రూనో' యను గొప్ప తత్వవేత్త తనయభిప్రాయ స్వాతంత్ర్యమునకు బలియై మూఢులగు క్రైస్తవమత గురువులచే ప్రాణములతో కాల్చివేయబడెను. 19వ శతాబ్దమున ఆయనయే ఆనీబిసెంటను పేరుతో వెలసెను. ఈయవతారము సహితము చాలింపబడినది. ప్రజల నుద్ధరించుటకై మరల నెవ్వ డేనామముతో నుద్భవించునో, లేదో యెవరి కెరుక?

సరాసరి ఉత్పత్తిదారుల వద్దనుండే కొని లాభము పొందండి!

సరిక్రొత్త డిజైనులలో, అందమైన చాయలలో అత్యంత
ఆకర్షణీయములైన బెనారస్ — కొల్లెగాల్ — బెంగుళూర్

# చీరలు

ఒకసారి దయచేసి చూడండి!

# "ఇండియన్ ఆర్ట్ప్యాలెస్"

(నాణ్యమైన బెనారస్, కొల్లెగాల్, బెంగుళూర్ చీరలు తయారుచేయువారు)

427, మింట్ స్ట్రీట్ (సాహుకారి పేట), మద్రాసు.

ఫోన్ నెం: 2676

హెడ్డాఫీసు: 'బనారస్'

ఈ క్రిందివారివద్దకూడ దొరకును:—

సి. వి. కన్నయ్యచెట్టి & కో.,

రెటన్ బజారు, మద్రాసు 3. ఫోన్ నెం: 3200

# బ్రిటిష్‌స్త్రీలు — నేడు — అంతా పనిమంతురాండ్రే



మనదేశంలో స్త్రీలే - పొద్దస్తమానం చాకిరిచేసే పనిమంతురాండ్రనీ - పాశ్చాత్యస్త్రీలంతా - పనిపాట్లు నౌకర్లకప్పచెప్పి విలాసాలలో పొద్దుపుచ్చే వన్నెల విసనకర్రలనీ చాలామంది చదువుకున్నవాళ్ళకిన్ని ఉండే అపోహ. బ్రిటన్‌లో నేటి పరిస్థితులనుగూర్చిన ఈ వివరాలు - [illegible] అపోహను తొలిగిస్తాయి.

యుద్ధకాలంలో ఆదేశంలో కార్మికశక్తి సంపూర్ణంగా వినియోగంలోకి తేబడినది. యుద్ధంముగిసినా - ఆ శక్తినట్లాగే వినియోగంలోనే ఉంచుతున్నారు. అంటే కాయకష్టం చేయగలవారంతా - స్త్రీలుసహా పనిపాట్లు చేస్తున్నారేగాని విలాసాలతో ప్రొద్దుపుచ్చడంలేదు.

బ్రిటన్‌లో పనిచేయగల వయసునున్న స్త్రీయెల్లా గృహకృత్యాలలోనో, కర్మాగారాలలోనో పనిచేస్తున్నది. ఆదేశంలో గృహలక్ష్మి అంటే ఇంట్లో పనిచేసే స్త్రీ అని అర్థం. వారిలో ప్రతి 5 గురికి ముగ్గురు గృహలక్ష్ములైయున్నారు; మరి ఇద్దరు కర్మాగారాలలో వేతనము పుచ్చుకొని కృషిచేస్తున్నారు.

1931 జనాభాలెఖల ప్రకారం ఒక్క-ఇంగ్లాండు, వేల్సు ప్రాంతాలలోనే - ఇండ్లల్లో జీతానికి పనిచేసేవారిసంఖ్య 10,00,000 గా ఉండేది. అయితే గత సం॥నాటికి ఈ సంఖ్య 5,00,000 కు దిగింది.

సాంఘికవ్యవస్థలో వచ్చిన మార్పుచేత ఈ తగ్గుదల యుద్ధానికిముందే ప్రారంభమైనది. 1931 లోనే పనిచేసే వాళ్లను పెట్టుకోగల గృహస్థులలో ముప్పాతికమంది ఒక్క నౌకరిని మాత్రమే ఉంచుకోగలిగేవారు. నేడు పన్నులు ఆకాశమంటినవి. పై తరగతివారు మధ్యతరగతివారు చదును అవుచున్నారు. అందుచేత నౌకర్లను చాకిర్లను పెట్టుకోగలవారే తగ్గుతున్నారు.

ఈ సంగతి ముందుగానే కనిపెట్టి - యుద్ధంరోజులలోనే ప్రభుత్వంవారు ఇద్దరు గొప్పస్త్రీలను - రాగల అవాంతరం ఆదుకొను సలహాలిమ్మన్నారు. వారిసూచనపై - (1944) ఇండ్లల్లో పనిచేసేవారి సంరక్షక సంస్థను ఒకదాన్ని ఏర్పాటుచేశారు. (1946) దీని ముఖ్యోద్దేశం ఇండ్లల్లో పనిచేయడం గౌరవప్రదంగా వించి,- ఎక్కువమంది స్త్రీల నాకర్షించడం. ఇటీవలవారు 450 స్త్రీలకు బాలికలకు గృహకృత్యాలలో తర్ఫీదు ఇస్తున్నారు. అప్పటికే 700 మందికి తర్ఫీదునిచ్చి - డిప్లొమా పట్టాలిచ్చారు.

బాలికలైతే 9 నెలల తర్ఫీదు. యువతులైతే [illegible] నెలలే. వీరు నేర్చేవిషయాలు: ఇంటిఖర్చు సర్దుబాటుచేసి లెఖవ్రాసిపెట్టడం. వంట, గుడ్డలుకొకడం, (పొంచి) పని, చిన్న చిన్న చేతిపనులు, ఆరోగ్యవిద్య, శిశువులను, వృద్ధులను సంరక్షించడం, సామాన్యవిద్య.

'రోజువారిగా ఇండ్లల్లో పనిచేసేవాండ్ల సేవాసమితుల'ని - 7 పట్నాలలో ఏర్పడిఉన్నాయి. వారి యాజమాన్యాన ఈ తర్ఫీదైన పనిమంతురాండ్రు పనిచేస్తున్నారు. వీళ్లకా సమితివారే వారానికి (44 గంటలపని వారానికి) ఒక్కొక్కరికు - పౌ. 3. 11 షి. 6 పెన్సులు (రు 47-11-0) లు వేతనమిస్తారు. నెలసరి జీతాలిచ్చి పనివాళ్లనుంచుకోలేని - గృహస్థులు - నిర్ణీతమైన గంటకొచ్చి నిర్ణీతమైన కాలం పనిచేసిపోయే యేర్పాటు. ఈసమితిద్వారా వీరిని మాట్లాడుకుంటారు. అందుకుగాను సమితివారే ఆగృహస్థుల వద్ద గం॥కు 2 షి. 6 పెన్సులు (రు 1-11-0) ఛార్జిచేసి పుచ్చుకుంటారు. అంటే - వీళ్లకిచ్చే వారం వేతనానికి బదులు - రు 74-4-0 వారికి ముట్టుతుంది. ఆ తేడా, పనిదొరకని గంటలనష్టం, సమితిఖర్చులు - వగైరాలు కూడదీసుకొను పనికివస్తుంది. పరిశ్రమాలయాల్లో పనిచేసే 18 సం॥లకు మించిన యువతులకు, పనిచేసే వారానికి (41. [illegible] గం॥ల పని) పౌ 3. 14. 6 (రు 49-11-0) కూలి. అందుచేత గృహకృత్యాల్లో పనిచేసేవారికి కర్మాగారం ఇంకా ఆకర్షణీయంగానే ఉంటున్నది.

అయితే ప్రభుత్వం ఈసంగతి గ్రహించి గృహిణులకు కష్టంతగ్గించను, క్రొత్తస్కీములు వేశారు. ఆరోగ్యసేవాశాఖ కుపాంగంగా - గృహిణీసహాయక సేవాశాఖ నేర్పాటుచేశారు. స్త్రీలు గర్భిణులై యున్నప్పుడు, జబ్బుపడ్డప్పుడు, పిల్లలతో సర్దుకోలేనప్పుడు వెళ్లివారికి సాయపడతారు. అందుకని - ఆయా కుటుంబాల స్థితిగతుల ననుసరించి - వారివద్ద రుసుము వసూలుచేస్తారు.

### ముఖ్య పరిశ్రమల్లో

అయిదింట 2 రు కర్మాగారాల్లో పనిచేస్తున్నారన్నా ముగదా! వారిసంగతి చూడండి ? గత సం॥ లెఖదీస్తే - వీరు 70,00,000 ఉన్నారు. ఆ దేశాలలో వివాహంగాని వంటరి స్త్రీలుంటారు. అట్టివారిలో 16-60 సం॥ల మధ్యవయస్కులున్నవారిలో - 100 కి 90 మంది ఈ ఉద్యోగాలలో ఉన్నారు. ఉడుపుల్లు తయారుచేసే పనివాండ్రలో 100 కి 69 మంది వీరు. వివిధసేవాశాఖలలో 100 కి 64 మంది స్త్రీలు; వస్త్ర పరిశ్రమాలయాల్లో 100 కి 59 మంది వీళ్లే. అంగళ్లలో బేరసారాలు నడిపించి వస్తువులు విక్రయించే వాళ్ళల్లో సగంమంది స్త్రీలు. ప్రభుత్వకార్యాలయాలలో, వర్తకవాణిజ్య సంస్థల కార్యాలయాలలో 100 కి 28 మంది, వస్తువు ఉత్పత్తిచేసే పరిశ్రమాలలో 100 కి 26 మంది, వ్యవసాయం, అటవీపరిశ్రమలు, చేపల పరిశ్రమలు - మున్నగువానిలోకూడా 100 కి 15 మంది - స్త్రీలు.

స్త్రీలు పనిచేయరాదని నిషేధింపబడినదల్లా ఒక్క బొగ్గుగనులలోనే. యుద్ధంగోజులలో - రైళ్లు, స్టీములాంచీలు, బస్సులు మున్నగు యాన ప్రయాణసౌకర్యాలలోను, ఇంజనీయరింగు శాఖలలోను స్త్రీలు పనిచేసిఉన్నారు. వారింకా ఆ పనులలో మానలేదు. యుద్ధానికిముందువలెనే వారానికి 48 గం॥ల పా. యక్ట్సొవ్రి పని నియమనిబద్ధము. రాత్రిళ్లు పనిచేయరాదు.

వివాహితలు - కుటుంబబాధ్యతలవల్ల పూర్తికాలం కర్మాగారాలలో పనికి ఓపలేకున్నారు. కాని వీలైనంతకాలం (Part-time work) పనిచేయడానికి వీరు కర్మాగారాలకు వచ్చి సంపాదించుకుంటు న్నారు. అంటే, తీరికచేసుకొని ఏగంటో 2 గం॥లో పనిచేసి నాలుగురాళ్లు సంపాదిస్తున్నారు. వీరిసంఖ్య యుద్ధానంతరం ఎలా పెరుగుతున్నదో - గమనించండి. 1942 లో 3,80,000, 1944 లో 9,00,000, 1945లో మాత్రం - 6,20,000 కు పడిపోయినది కాని మళ్లీ 46 నాటికి - 8,00,000 అయినారు.

ఈవిధంగా స్త్రీలు అక్కడ పనిమంతురాండ్రుకాగా - దానితో క్రొత్తసాంఘికసమస్య ఉదయిస్తు న్నాయి. పగలు పసిబిడ్డల నాదరించే - శిశుసంరక్షణాలయాలు ఎక్కువచేయాలిసి వస్తున్నది. పురుషులతో పాటు సమంగా చేసినపనికి స్త్రీలు సమంగా కూలి అడుగుతున్నారు.

## జోలపాట

శ్రీ మిక్కిలినేని భగవంతరావుగారు

లాలి రత్నాలకోవా నాతండ్రి లాలి ముత్యాలప్రోవా
లాలి సౌందర్యజీవా నాతండ్రి లాలి నానోమువంటా ||లాలి||

ఖండఖండాంతరాలు నీజాతి ఖ్యాతిగన్నదిర మున్నూ
ఖండిపోర్లినభూమి రా నీభూమిపైడిబండిన భూమిరా ||లాలి||

కలకంఠకంఠి కన్నీరొలికినా కలువదూ సిరియందుదూ
నిరుపేదసుతుల జూచి శోకించు భరతమాతనుగానరా ||లాలి||

బానిసైపదిగాలముల్ బ్రతికినా ఫలితంబు లేదు తండ్రీ
స్వాతంత్ర్య రాజ్యమందూ క్షణమైన సౌఖ్యమొందగవేలురా ||లాలి||

కత్తికలములరెంటనూ నాతండ్రి శక్తిబూంచను జూడరా
కత్తిగలిచినవీరుల కమనీయ గాథలున్నవి పాడరా ||లాలి||

పరవేష భాషలంటే నాతండ్రి పరుగులెత్తకుర నీవూ
సౌవర్ణ వర్ణములతో నీదేశ చరితమును సాధించరా ||లాలి||

సర్వప్రపంచమునకు సద్ధర్మ సన్మార్గములు చాటెరా
శాంతిదూత గాంధిజీ సూక్తులను శ్రద్ధతో నాలించరా. ||లాలి||

# సత్యభామ వీరవిహారము

## (నరకాసురవధ)

ఆరవెల్లి కనక రాజగోపాలాచార్యులు.

వజ్ఝ శ్రీమన్నారాయణ.

ప్రదేశము:- (ద్వారకానగరమునందలి రాజాంతఃపురము. శ్రీ కృష్ణుని రుక్మిణీ సత్యభామాదులు సేవించుచుందురు.) ప్రవేశము - నారదుడు.

నారదుడు - [తంబురా మీటుచు - శ్రీ కృష్ణుని కీర్తింపుచు] హేజగన్నాటక సూత్రధారీ! దనుజారీ! [అని పాటపాడుచు అంతఃపురము ప్రవేశించి కృష్ణుని చేరను.]

శ్రీ కృష్ణుడు:- బ్రహ్మ మానసపుత్రా! సుగాత్రా! వందనములు.

రుక్మిణీ. సత్య:- నారదమునీంద్రా! జోహారులు.

నార:- పత్నీసహితముగా శ్రీ కృష్ణభగవానులకు సుభమగుగాక!

శ్రీకృష్ణ:- [రుక్మిణీదేవిచే నొకబంగరు కలశంబుతో జలంబుదెప్పించి, నారదమహర్షి పాదములు కడిగి, తడియొత్తి, యుచితాసనంబున కూర్చుండబెట్టి] [సత్యభామ నుద్దేశించి] సత్యా! మునీంద్రులకు వీచుము. [మందహాసముతో] తపోధనా! మీ రాకచే పత్నీసమేతముగా ధన్యుడనైతిని. తమ రాకకు కారణ మడుగవచ్చునా?

నార:- కృష్ణా! సర్వజ్ఞుండవగు నీకు తెలియని కారణ మెందేనికలదా? అయినను నేవచ్చుకారణము దాపనేల, నేనే విన్నవించెదను.

కృష్ణ:- చిత్తము కలవిందు. వినుట కెంతయో నా మనము తొందరపెట్టుచున్నది.

నార:- ఆశ్రిత త్రాణపరాయణుడవగు నీవు భక్తుల యాపదలలో తొందరకాక తాపీయా?

[రాజనగరున కలకలము. కృష్ణనారదాదులు కలకల మేమని ఆలోచింపుచుండ ప్రవేశము - ద్వార రక్షకుడు.]

ద్వార: ప్రభూ! నమస్కారములు.

కృష్ణ:- ద్వారపాలా! ఏమి ఆతురమున వచ్చితివి.

ద్వార:- మహానుభావా! ఎవ్వడో రాక్షసుడు ప్రజల నానాబాధలు పెట్టుచున్నాడని తమతో మనవిచేసుకొనవచ్చి యాక్రందించుచున్నారు.

కృష్ణ:- మునీంద్రా! తామిచ్చటనే యుండుడు. సత్వరముగా నాసమాచారము కనుగొనివచ్చెదను.

[అని తొందరగాలేచి ద్వారదేశమున కేతెంచెను.]

ప్రజలు:-

సర్వజగదధీశ! సర్వజ్ఞ సర్వాత్మ!
భక్తవరద! కృష్ణ! భవ్యచరిత!
నరకుడనెడివాడు నానావిధంబుల,
బాధలిడుచునుండె వాని ద్రుంపు.

జగద్రక్షకా! సపరివారముగా నానరకాసురుడు పట్టణముపైనను గ్రామములపైనను దాడిసల్పి ప్రజకు నిద్రాహార శూన్యంబు గావించుచున్నాడు. కావున వాని బారినుండి మమ్ము రక్షింపుము. [అని విన్నవించుదురు.]

కృష్ణ:- జనులారా! లెండు. మీయాపదలు శీఘ్రముగా కడతేరగలవు. జనుడు సుఖంబుగా నుండుడు [అని అభయ మొసగును.]

[ప్రజలు వారిబాధలు తీరినవన్న ధైర్యముతో కృష్ణుని స్తుతింపుచు వెడలుదురు.

కృష్ణుడు రాజసౌధము ప్రవేశించి జరిగిన సమాచారమంతయు నారదునితో విన్నవించెను.]

నార:- కృష్ణా! నేను వచ్చిన కార్యంబు కూడనదియే; నరకుడు భూగర్భసంజాతుడు; అతి దుర్మార్గుడు,

దేవలోకముపై దాడిసల్పి దేవమాతయగు నదితి స్వర్ణకుండలముల నపహరించి దేవతలకెంతయో కీడొనర్చెను. వానితమ్ముడు మురుడనువాడు పంచవక్త్రుడు అన్నకుదగిన తమ్ముడు. తన తపః ప్రభావంబున వారి రాజధానియగు ప్రాగ్జోతిష పురమును పాశబద్ధంబు గావించి యితరులకు జొరఅశక్యంబు గాకుండ జేసెను.

కృష్ణ:- మహర్షీ! ఏమీ అద్దురాత్ముండు. దేవలోకముపై దాడిసల్పి పూజనీయయగునదితిస్వర్ణకుండలము లపహరించెనా? [నరకునుద్దేశించి] ఓరీ! నరకా!

అబ్ధిజొచ్చిన పాతాళమందు నున్న,
ఆకసంబున కెగసిన, నబ్జభవున
కెఱగియుండిన, రుద్రుని చరణములను
శరణువేడిన జంపుదు నరకుఁగొనక.

నారద:- తథాస్తు! కృష్ణా! దుష్టశిక్షణా! నీకార్యదీక్ష నేమనివర్ణింతును? జయమగుగాక!

కృష్ణ:- మునిచంద్రా! నేనిదే నా ప్రాగ్జోతిషపురంబుపై దాడిసల్పి మురునితో కూడ నరకాసురుని బరిమార్చి దేవమానవులకు రాక్షసబాధ లేకుండ జేసెదను. [అని గరుడుని తలచినంతనే మనో వేగంబున గరుడుడువచ్చిన, శంఖచక్రగదా శార్ఙ్గములధరించి] మహనీయా! శలవొసంగుడు. గరుడారూఢుండనై జని ఆదుష్టాత్ముల ద్రుంచి మాననీయయగు నదితి స్వర్ణకుండముల దెచ్చి యామెకు సమర్పించుకొనెదనని నామనవిగా నామెకు విన్నవింపుడు.

సత్య:- నాథా! నేను మీతో వచ్చెదను తోడ్కొని వెళ్లుడు.

కృష్ణ:- దేవీ! ఎందులకీవు నాతో వచ్చెదవు. నేను వాహ్యాళి వెళ్లెదననుకొంటివా?

రుక్మి:- సోదరీ! నాథునితో జను టెందులకు? ఆ దురాత్ములతో యుద్ధము చేయుట చూడ కుతూహలముగా నున్నదా?

సత్య:- ఔను. నాథుని కండయైయుండి నేను యుద్ధమొనర్చెదను.

రుక్మి:- సత్యా!

ఏ యుగంబులందు నేని, చిగురుబోడు
లాహవంబు సేయ నరుగునట్లు
వినుటలేదు ధరణి వీరము నీకేల,
భర్త చాలబోడె, పగఱద్రుంప?

కృష్ణ:- సాత్రాజితీ! నాతో యుద్ధమునకే తెంతువా? చాలు చాలు భీష్మపుత్రి చెప్పినటుల నబల లాహవమున కరుగరాదు. ఆహవమన నేమనుకొంటివో!

నెమ్మలపింఛతో నెఱపు నాట్యము కాదు
పంచాస్య లాఘవ పక్కి కాని
చిల్కలతో ముద్దు పల్కుబల్కుట కాదు
భయదాట్టహాస సంభవము కాని
వీణియ చేబూని వేడ్కబాడుట కాదు
ఘనబాణగుణమెక్కు గనుట కాని
లలనతో బూలు జిలుకుచుండుట కాదు
శరవర్షధారల జనుట కాని

చందనాదుల మెయి జర్చ సేయుట కాదు,
రక్తధార లింక రజము సోకి
వికృతరూప మొందు విధము నీకెంచుకు,
గృహమునందు శుభము గెఱలు మింతి.

సత్య:- ప్రభూ! ఏమనుచుంటిరి మీచెంతనున్న నా కాయసమా?

పంచాస్య లాఘవ పద్ధతి నీచెంత
నర్తకీ నృత్య మనాథ నాథ
భయదాట్టహాస సంభవమైన నీచెంత
సలలిత కీరవాచకము నాథ
ఘనబాణగుణమెక్కు గనుటైన నీచెంత
లలి విపంచీ తంత్రి ఫలము నాథ
శరవర్షధారా ప్రచారంబు నీచెంత
పూవుల జల్లుట బోలు నాథ.

నల్ల మేను నిండ జల్లిన నీచెంత,
జందనంబు కాదె చర్చ సేయ
వికృతరూప మెటుల వెలయును, నీచెంత
సకల వసుమతీశ సార్వభౌమ!

నార:- [సాత్రాజితీదేవి పట్టినపట్టు వీడకున్నది. ఎటులైన కృష్ణునితో చెప్పి ఈమెను తోడ్కొనిపోవునటుల చేసెదను.] కృష్ణా! వాహ్యాళికేని నొక్కరు వెళ్ళరు. ఆహవమున కరుగునప్పుడు నీవొక్కరుండ వేగుట నాకును సమ్మతంబు కాదు.

కావున నీవె ప్రార్థన మంగీకరించి తోడ్కొని పోయి జయేందిరతో కూడ శీఘ్రముగా రమ్ము. [భీష్మపుత్రి నుద్దేశించి] అమ్మా! భీష్మపుత్రీ! నీవు వీరపుత్రివి. వీరపత్నివి కావున విజయ చిహ్నముగా కుంకుమముతో నీనాథునకును సోదరికిని నుదుట తిలకమొంచుము.

రుక్మి:- [మహదానందముతో తొందరగాబోయి హేమపేటికలో కుంకుమముదెచ్చి సత్యాకృష్ణులకు నుదుట తిలకమిడి] జగన్నాయకా! దుష్టశిక్షణ మొనర్చి శీఘ్రమ్ముగా జయేందిరతో కూడ రమ్ము!

నార:- తథాస్తు! అమ్మా! రుక్మిణీ! చూచితివా వీరమహిళవగు నీవు నీనాథు నుదుట తిలకమిడిన తోడనే శ్రీకృష్ణమూర్తి జయలక్ష్మి నప్పుడేవరించి నట్లున్నాడు.

రుక్మి:- చిత్తము మహనీయా! మీ యాశీఃప్రభావమున జయముచేకూరకేమగును?

నార:- జగద్రక్షకా! ఇదే శుభసమయము. వైరుల వధింపజనుము. నేనును దేవలోకమున కేగి ఈ వార్త నదితికి విన్నవించి యామె నూరడించెద. నేపోయివచ్చెదను.

కృష్ణ:- చిత్తము. మహనీయా! శలవొసంగుడు [దేవీ సహితముగా నారదునకు ప్రణమిల్లును] [రుక్మిణి నుద్దేశించి] దేవీ! భద్రమ్ముగానుండుము.

[అని సత్యభామాసమేతముగా గరుడారూఢుడై ప్రాగ్జ్యోతిషంబున కేగును.]

[అందరు నిష్క్రమింతురు. తెరవ్రాలు.]

## 2. వ రంగము

[ప్రదేశము, ప్రాగ్జ్యోతిషపురబహిః ప్రదేశము. సత్యాకృష్ణులు గరుడారూఢులై]

సత్య:- ప్రాణేశ్వరా! ఆ కనుపట్టుచున్న పట్టణ మెయ్యది? దాని పాలించెడి రాజెవండు? చూచితిరా! భూమి సకల సస్యాఢ్యయై వరలుచున్నయది.

సుందరో పారావము లెల్లెడల జిగిర్చి పూచి కాచి ఫలించి కోకిల ధ్వనికిమైత్రి భ్రమరానీకము నకు నీమై చిలుక పలుకులకు నిలయమై కనుల పండువై శ్రవణానందమై ఆత్మాహ్లాదమై యలరారుచున్నయవి. ఇందొక కొంతతడవు విహరింతమా! అల్లదే కమాలవృక్షము నీశరీరచ్ఛాయ హాసియించినట్లున్నది. చూచితే! సితపుండరీకము నీవీక్షణముల దలపించుచున్నయవి కాంచితే! గండుతుమ్మెదలు నీకేశముల ధిక్కరించుచున్నట్లున్నవి వీక్షించితే! చంపకప్రసూనము నీ నాసికను ప్రహసింపదలంచుచున్నయది హృదయేశ్వరా! ఇచ్చట చరాచరములు నీరూపవిలాసమ్ములకు వైరుధ్యమెంచుచున్నయవి; కారణమేమైయుండును?

కృష్ణ:- సుందరీ! మోహంబున నీవట్లు భ్రమపడుచుంటివి. కాని యవి క్షరంబులు క్షణికంబులు. యెవ్వియైన నస్మద్రూపసౌష్టవంబునకు సరిరావు. ఈపురమ్ము ప్రాగ్జ్యోతిషపురమ్ము. ఇందలి రాజే నరకుడు. వానితమ్ముడు మురాసురుడు. వార్లచరిత్రం బెఱింగినదేకదా?

సత్య:- నాథా! ఈ పురప్రాకారముచుట్టు నతి భయంకరమై నలరారు నాపాశంబుల భేదించిన కదా పురప్రవేశము. అక్కట్లు భేదించునుపాయమేమి?

కృష్ణ:- సత్యా!

ఇప్పాశంబుల ద్రుంపగ,
నెప్పాటును సంశయంబు నీకేలమదిన్
గుప్పించి మోదిగదచే,
డప్పించెదకట్లుద్రెంచి దైన్యులభయమున్.

[అని గదచే నొక్క వ్రేటువేయగా నాకట్లు తెగును. సత్యాకృష్ణులు పురప్రవేశమొనర్తురు.]

[ప్రదేశము:- నరకసభ మంత్రులు నరకాసురుడు కొలువుందురు నగరరక్షకులు ప్రవేశము.]

నగరరక్షకులు:- మహారాజులుంగారికి నమస్కారములు.

ప్రధాని:- చారులారా! వింతలేమి? మీవాటములు జూచినచో మీకెద్దియో భయముకలిగినటుల దోచుచున్నది. మీ భయకారణము దెల్పుడు.

న. ర:- ప్రభూ! ఇంక కారణమడుగుచున్నారా! యుద్ధమునకు సిద్ధముకావలెను. ఎవ్వడో నొక మహిళాసమేతముగా శంఖ చక్రాద్యాయుధములతో గరుడవాహనారూఢుడైవచ్చి ప్రాకారాంతరపాశంబుల ఛేదించి పురప్రవేశమొనరింప ద్వారరక్షకులు ఢీకొనిన వారి నవలీలాగాజంపి పురములో జొచ్చుచున్నారు. ఘడియకో ఘడియకో కోట ప్రవేశింపగలడను భయముతో మీతో విన్నవించుకొనవచ్చితిమి.

ప్రధా:- మహారాజా! తమ్ములకు కబురంపుడు. ఆవచ్చెడివాడు జరాసంధుని దాడికిభయపడి సముద్రమధ్యంబున నగరము గట్టుకొనిన పిరికివాడు. శ్రీకృష్ణుడనువాడు.

నరకుడు:- అహ్హాహ్హా! మనపైదాడి సల్పుటా? త్వరగా సైన్యంబు నాయత్తపఱపుము. నేనువచ్చి వాని మదమడచెదను. [అందఱు నిష్క్రమింతురు.]

3 వ రంగము.

[ప్రదేశము యుద్ధభూమి. గరుడ వాహనారూఢుడై శంఖ చక్రాద్యాయుధములతో సత్యభామాసమేతంబుగా నొకవంక; మురాసురుడు సైన్యాధిపతియై వేఱొక ప్రక్క నిలచి యుందురు.]

మురాసురుడు:- [కృష్ణుని వంకజూచి ఫీంకార మొనరించి భుజములప్పళించుచు] ,ఓరీ! నరాధమా! ఒకమానినీసహాయమున నొక పిట్టపై నెక్కి వచ్చి మాపై యుద్ధము ప్రకటించితివా? ఎంతటికైన సాహసించెదవు. ఈమురాసురుని చేతిలో జచ్చుట కిచ్చట కేతెంచితి కాబోలును.

కృష్ణు:- దుర్మార్గా! మురాసురా!

అలతుల నెందఱింగదన
మందు జయించుట దొడ్డకాదు నీ
కిలక్రొతుకంగరాదు భువి
నీశ్వరుడౌ విధి నేటితోడు తన్
గలచును నీ పరాక్రమము
గాన రాదు మహీతలంబునన్
జలమున రమ్ము! చచ్చెదవు
చయ్యన దుష్కృతి క్రూర కర్ముడా!

[అని శార్ఙకోదండ మెక్కుపెట్టి శాంకృతి యొనర్చి ఒక్కమ్ము నారి తగిలించిన మురునిపై వైవ వదిరయమ్మునబోయి మురుని సైన్యంబుతో బరిమార్చెను. తోడనే నరకుడు మరికొంత సైన్యంబుతో కృష్ణుని మీదికేతెంచగా]

సత్య:- నాథా! తామింతసేపు రాక్షసులతో యుద్ధముచేసి యలసియుంటిరి కాన నాకావిల్లందీయుడు. [అని విల్లందుకోబోవును]

కృష్ణు:- సత్యా! ఈచచ్చినవాడే మురాసురుడు. ఆసమీపించుచున్నవాడే నరకాసురుడు. క్రూరుడగుట జంపవలెను గాని లేకున్న నీకును నాకును అప్రదు.

సత్య:- ఎవ్వడైననేమి! దురాత్ముడగుట వీనినివిడువరాదు వీనినుక్కణంచెద.

కృష్ణు:- భామా! దుష్టుల జంపగలేమా! నీకేల విల్లందును! ఇదిగో.

సత్య:- [విల్లంది ప్రహసిత ముఖముతో] మానసీయా! భవదీయ యాశీః ప్రభావంబున నాశరీరమున కెంతో బలము కలిగినది. చూడు డొక్కతూపున వీని కడతేర్చెద. [శౌర్యముతో నరకునిజూచి] ఓరీ! దుర్మార్గా! నరకా? నీవొక యబలచే జచ్చెదవెందులకు, వేగమే యాశ్రితత్రాణ పరాయణుడగు శ్రీకృష్ణుని చరణంబుల శరణనుము. లేకున్న నీశిరంబిదే యాకాశంబున కెగయును.

నరకుడు:- కృష్ణా! నీ స్త్రీలోలత్వము సార్థకమయ్యెను. యుద్ధసమయమున కూడ భార్యనువిడువక వచ్చి. నేనువచ్చినవ్వటికి దాగవలసిన పనిగలిగినదా? స్త్రీలతో రాజులు యుద్ధము చేయరు. నీకు రాజధర్మము తెలియదు కాబోలు. రమ్ము విల్లుపట్టుము, లేకున్న శరణనుము.

సత్య:- ఓరీ! నరకా! నీకేల ఈడాంబికము. స్త్రీకదనమున నిలిచినదని. ఏమేమో ప్రేలుచుంటివి. రాజధర్మము కృష్ణునకు తెలియకకాదు. నీచుడవగు నిన్ను ఆడుదానిచేత జంపింపనెంచి నాచేతికి విల్లందించెను.

నర:- ఓసి! గయ్యాళీ! మగని వెనుకకు నెట్టియుద్ధమ్ము సేయవచ్చిన ధూర్తవు. నీమొగము చూడరాదు; నీమగని ముందునకు రమ్మనుము. లేదేని స్త్రీహత్యయని దలచక శూలంబుచే నిన్నుజంపి వేఱొక బాణంబున సుపర్ణ సమేతంబుగా కృష్ణుని జంపెద [అని శూలము విసరును]

సత్యః- [వచ్చిన శూలము ఖండించి] దురాత్మా! కృష్ణుని స్త్రీలోలుడవని నిందించితివి. కాని నీవు షోడశసహస్ర రాజకన్నియల నపహరించి కారాగారంబున బంధించి యుంచినాడవు. ఆపాపము నిన్ను కుడుపక మానదు.

[అని యొక బాణము నరకునివక్షస్థలమున వేయును]

నర:- [ఆబాణము పెకలించి] అహ్హహ్హా! కృష్ణా! నీశౌర్యము జరాసంధునితో బోయినదే. కాలయవనుని ముచికుందునిచే జంపించి, హంసడిభకుల నుపాయంబుచే సంహరించితివి. ఆటనకొనియీ నాపై యుద్ధము ప్రకటించితివి. స్త్రీలతో రాసక్రీడ లొనర్చిన నీయడుగులు, హస్తములు నతికి నరకునను పేరు సార్థకము చేసుకొందును. [అని శరవర్షము కురిపించును.]

కృష్ణు:- [సత్య చే విల్లందివచ్చెడి బాణములెల్ల నొక్కతూపున ఛేదించి]

ఓరీ! దుష్టుడా! ఇదిగో ఈబాణమున నీప్రాణము దీయుదును. [అని బాణమువేయును ఇర్వురు శరవర్షము కురిపించుకొందురు. అంతకంతకు నరకుని చేయిమించును]

సత్యః- నాథా! ఇంక వీని దగవేయుదు. వీడు సాధారణముగా జచ్చునట్లులేడు.

కృష్ణు:- సత్యా! తొందరపడకుము. [నరకునిజూచి] ఓరీ! ఈబాణంబున నీప్రాణము పోవును. కాచుకొమ్ము!

నిత్యసత్య వ్రతుండనై నెగడుదేని;
భక్తపరతంత్ర దీక్షతో బరగుదేని
బ్రహ్మచర్యంబు తోడుత బ్రబలుదేని,
శస్త్రమిప్పు డెజంపు రాక్షసుని త్వరగ.

[అని యొక్క యమోఘాస్త్రంబునేయగా సైన్యసమేతంబుగా నరకుడు భూమిపై బడిమడిసెను. దేవతలంతరిక్షమునుండి పుష్పవర్షము కురిపించుచు దుందుభులు మ్రోగింపజేసిరి. ఈవిషయము నారదుడు తెలుసుకొని వచ్చి కృష్ణునాశీర్వదించుచు]

జయము దానవ నాశకా
జయము జయము
జయము ఆశ్రితమందార
జయము జయము
జయము లోకైక సద్వీర
జయము జయము
జయము శ్రీకృష్ణ ప్రభునకు
జయము జయము.

కృష్ణా! నేటితో నీదుష్టాత్ముని వలన బాధలు గట్టెక్కినవని ప్రజలు మహదానందంబు నొందుదురు. [కృష్ణుడు నరకుని కుమారుని పిలిపించి స్వర్ణకుండలముల దెప్పించి నారదున కొసంగి, కారాగారబద్ధులైన పదునారువేల రాజకన్నియల విడిపించి వారిప్రార్థనవలన వారితో కూడ గరుడారూఢుడై ద్వారిపతి కేగెను. నారదుడు మహదానందముతో స్వర్ణకుండలముల నదితికర్పించి జరిగిన సమాచారమంతి యెరింగించెను. నాటినుండి నరకుని వలన బాధలు తీరనవని ప్రజలు మహోత్సవము లొనర్చి ఇంటింట చెప్పతరముకాని యానందమనుభవించుచున్నారు.]

సమాప్తము.



# మన ఆంధ్రదేశంలోనే మనకు హక్కు లేదా?

గంగాధరభట్ల లక్ష్మీదేవి.

హక్కు లేదా? అన్న విషయం మనలో తేలలేదు. మన ఆంధ్ర మహిళలకు మన ఆంధ్రదేశంలోనే జరుగుతున్న అన్యాయాన్ని మనం కొంచమయినా గుర్తించుకోలేకుండా ఉన్నాం. మనయింట్లో ఏం జరుగుతున్నది మనమే గుర్తించుకోలేకపోతే పైసంగతులు మనం గుర్తించమన్న దానికిసందేహంలేదు. స్త్రీలకు విద్యలేకపోతే మానహీనమే అన్న విషయం క్రొత్తకాదు. ఎంతమంది మన ఆంధ్ర స్త్రీలు పెద్ద పదవులలో లేరు? వారు మనలగురించి కొంచమయినా గుర్తిస్తున్నారా? అన్న విషయంచూస్తే మనకే తెలుస్తుంది. మనకు వెనుకబడి ఉన్న రాష్ట్రాలుకూడా మనకంటె ముందుకువచ్చి, కేరింతాలు కొడుతున్నాయి. మనకు మాత్రం పౌరుషంలేదని చెప్పుకోవటానికి చాలా సిగ్గుచేటుకదా! యిప్పుడయినా మన ఆంధ్ర మహిళలు కళ్లుతెరవాలి. మనహక్కులను గురించి మన రాష్ట్రంలో మనం పోరాడకపోతే యింకెవరు పోరాడుతారు?

ఒరిస్సాలో స్త్రీలు మనకంటె తెలివితక్కువగా ఉండేవారనీ, అనాగరికులనీ యిండ్లలోనుండి, ముసుగులు తీయకుండా యిండ్లలోనే కుమిలిపోతూ ఉంటారనీ మనం ఎన్నిసార్లో వార్ని వెక్కిరించి ఉండలేదా? ఇంతలోనేవారు నవనాగరికులు. విద్యావంతులు అవుతారని మనం, కలలోనేనా అనుకున్నామా? ఒకరినిదెప్పి మనం జారిపడ్డాము.

వారియింట్లో (రాష్ట్రంలో) వారికి జరుపబడుతున్న సదుపాయాలు చూస్తే చాలాముచ్చట వేస్తుంది. కాని వారికంటే ఆర్థికంగాగాని, అధికార పూర్వకంగాని, ఏ లోపంలేకుండా, సకలశక్తులను కలిగి ఉండికూడా మనం ఏమయినా చేసుకోగలుగుతున్నామా? మనం కొద్దిగా తలఎత్తి దైవమిచ్చిన రెండు కళ్లు తెరచి చూస్తే మనకే తెలుస్తుంది.

ప్రతి కాలేజీలోను, ప్రతిహైస్కూలులోను కూడా వారికి సర్వస్వాతంత్ర్యము లభించిందన్న మాటలో సందేహంలేదు. వారివలెనే మనకుకూడా స్వాతంత్ర్యము ఎందుకు లభించకూడదు? స్త్రీకి విద్యలేకపోతే హక్కు ఎక్కడినుంచి వస్తుంది? కాని అది మార్కెట్‌లో కొనేవస్తువా?

తినటానికి తిండిలేక, కట్టుగుడ్డలేక బాధపడుతున్న బీదమహిళగతి ఏమిటి? మనం కొంచమయినా ఆలోచించామా? ఇటువంటి పరిస్థితులలో వందలకు వందలు వేనకువేలు ఖర్చుపెట్టి విద్యనభ్యసించటమెట్లా? మనకర్తవ్యం మనమీదనే ఆధారపడి ఉన్నదని మనం మరచిపోయాం. ఒరిస్సాలోవలెనే మనరాష్ట్రంలోకూడా మనకు ప్రతిహైస్కూల్లోనూ ప్రతికాలేజీలోనూ ఉచితంగా విద్యనభ్యసించే ఏర్పాట్లు చేయించుకుంటేనే మనమహిళలకు స్వతంత్రము వచ్చినట్లు. అంతవరకు మన రాష్ట్రంలో నోరెత్తి మాట్లాడడానికికూడా హక్కులేదు? అన్నమాట ముమ్మాటికి నిజం.

యీ సంగతి మన రాష్ట్రంలో ఉన్న మహిళామండలి సమావేశాలలో తీర్మానాలుచేసి మనకు జరుగుతున్న అన్యాయాన్ని మనం మన ప్రభుత్వానికి చూపించాలి. "అడగనిదే అమ్మయినా అన్నం పెట్టదు" అన్న సామెత జ్ఞాపకం ఉంచుకొని త్వరపడాలి.



# సామెతలు

691. ఒళ్ళెరుగని శివము, మనసెరుగని కల్ల ఉన్నదా?
692. ఓపనివాడు కోరనిదీ, ఒంటనివాడు ఆడనిదీ వున్నదా?
693. ఓలితక్కువఅని గుడ్డిదానిని పెండ్లాడితే ఇలకు మూడు అవాలు.
694. కంచము అమ్మి మెట్టెలుకొన్నట్టు.
695. కండ్లుచెరిపిన దేవుడు మతిఇచ్చినట్లు.
696 కత్తితీసి కంపలోవేసి యేకుతీసి పొడుచుకుంటానన్నట్లు.
697. కత్తిపోటుతప్పినా కలంపోటుతప్పదు.
698. కనిగుడ్డి, వినిచెవుడు.
699. కనుకొక్కునిరారా అంటే, కాల్చివచ్చేవాడు.
700. కన్నతల్లికయినా కనుమరుగుండవలెను.
701. కలవారింటి ఆడపడుచును, కాకరకాయ కానరాదు.
702. కాచినచెట్టుకు రాళ్లదెబ్బలు.
703. కార్తెముందర వురిమినా, కార్యము ముందర పదిరినా చెడుతుంది.
704. కార్యంగొప్పా, వీర్యంగొప్పా.
705. కాలముపోవును, మాటనిలచును.
706. కాలినమన్నూ, కాలిన మన్నూ అంటవు.
707. కాలుజారితే తీసుకోవచ్చునుగాని, నోరుజారితే తీసికోరాదు.
708. కాలుజారి నేలపడి భూమి అచ్చివచ్చినది కాదు అన్నట్లు.
709. కావడి ఎన్నివంకలు పోతేనేమి, ఇల్లువచ్చి చేరితే సరి.
710. కాశికిపోగానే కర్రికుక్క గంగగోవగునా?
711. కానుకగతిలేదు, నూటికిమోడి వేసినాడు.
712. కానుక దోవలేదు, మాటపరవాలేదు.
713 కుంటికులాసం, ఇంటికిమోసం
714. కుండల్లో గుఱ్ఱాలుతోలేవాడు.
715. కోడికి కులాసంలేదు, కోమటికి విశ్వాసంలేదు.
716. కొంగుతడిస్తే చలిగాని, కోకంతా తడిస్తే ఏమి చలి?
717. కోడిపోయి కొమ్మఎక్కినట్టు.
718. గంగలోమునిగినా కాకి హంసఅగునా?
719. గడచిబ్రతికినామని గంతులు వెయ్యరాదు.
720. గరుడాయ లెస్సాఅంటే, శేషాయిలెస్సాఅన్నట్లు
721. గాడిదపుండుకు, బూడిదెమందు.
722. గారాబము గారెలకు ఏడిస్తే, వీపుదెబ్బలకు ఏడ్చినట్లు.
723. గాలికిపోయిన పేలపిండి భగవదర్పితంఅన్నట్లు.
724. గాలిలో దీపముపెట్టి, దేవుడా నీ మహిమ చూపుమన్నట్టు.
725. గురువుకుతగ్గ శిష్యుడు.
726. గురువునిలుచుండి త్రాగితే. శిష్యుడు పరుగెత్తుతూ తాగుతాడు.
727. గుడ్డిపాము కరచినట్టు, గంగిగోవు పొడిచినట్టు.
728. గృహప్రవేశమునకు వెళ్లుతూ, గుడ్లగూబను తోడుతీసికొనిపోయినట్లు.
729. గొడ్లుకాచేవాణ్ని కొట్టనివాడున్నూ, గొఱ్ఱెలు కాచేవానిని తిట్టనివాడున్నూ లేడు.
730. గొల్లవానిపెండ్లి తెల్లవారినట్టు.
731. గోచిపాతరాయుడు దొంగలమిండడు.
732. యిటునూయి, అటుగోయి.
733. వీధిలోరాజునుచూచి, ఇంటిలో మగనిమోచి మొత్తుకున్నదట.
734. వసుదేవుడువెళ్లి గాడిదెకాళ్లు పట్టుకొన్నట్టు.
735. విచిత్రం వినబూటకం, అలంగొప్ప మొగుడేడువ.
736. హెచ్చుపేలున్నవాళ్లకు, హెచ్చుఅప్పులున్నవాళ్లకు దురదలేదట.
737. కుమ్మరివీధిలో, కుండలుఅమ్మినట్లు.
738. కట్టినతేలు గుణవంతురాలు, కూసినఅమ్మ కుక్కముండ.
739. కుమ్మరిపురుగుకు మన్ను వొంటఅంటదు.
740. కూతుళ్లుకన్నఅమ్మకు కురిచీపీటలు, కొడుకుల కన్నఅమ్మకు గోడపంచలు.
741. కూటికిపేదఅయితే కులానికిపేదా?
742. కొండ తలక్రిందపెట్టుకొని రాళ్లువెతికినట్లు.
743. కొట్టకమునుపే ఏడుస్తావేమంటే, ముందు కొట్టబోతావని ఏడుస్తానన్నట్లు.
744. గతిలేనిఅమ్మకు, మతిలేని మొగుడు.
745. చెట్టుఅయివంగనిది మానుఅయివంగునా?
746. చెట్టుచెడేకాలాన, కుక్కమూతిపిందెలు పుట్టుతున్నవి.

# లోక వార్తలు

ఈనెల [illegible] వ తేదిన శ్రీమతి సరోజినీనాయుడు గారి జయంతి యుత్సవ సందర్భమున ఆమె కుమార్తె శ్రీమతి పద్మజానాయుడుగారు సికందరాబాదు పరిసరగ్రామములలో 200 మంది బీద కుటుంబీకులకు వస్త్రదానంచేసింది.

◆ ◆ ◆

ఇటీవల బెజవాడ మునిసిపాలిటీవారు సమావేశమై తిరువూరు (కృష్ణాజిల్లా) లో జరుగుచున్న ఆంధ్రస్త్రీ బేసిక్ ట్రెయినింగు స్కూలుకు రు 500-లు విరాళ మిచ్చుటకు తీర్మానించినారు.

◆ ◆ ◆

మన రైళ్లలో ఇటీవల తీసివేయబడిన ఇంటర్ క్లాసును తిరిగీ ప్రవేశపెట్టుతారట.

◆ ◆ ◆

మధ్యరాష్ట్రములలో బిచ్చగాండ్లు దేవాలయాలలో దూరకూడదని—నిషేధింపబడినది.

◆ ◆ ◆

శ్రీమతి విజయలక్ష్మిపండిట్ గారి కడపటి కుమారిత రిటా (కన్య) న్యూయార్కు (అమెరికా)లో చదువు ముగించుకొని - స్విజర్ లండ్ లో జినివా విశ్వవిద్యాలయమున చదువవెళ్లినది.

◆ ◆ ◆

టిబెట్ దేశానికి పరిపాలకుడు, మఠాధిపతికూడా ఒక్కరే. ఆయనను లామా అంటారు. ఆయన నిటీవలఎవరో అపహరించుకొని పోయినారట. టిబెటును కాజేతామని-చైనా కమ్యూనిష్టులే ఈపని చేసిఉంటారని అనుమానపడుతున్నారు.

◆ ◆ ◆

శ్రీమతి టి. రుక్మిణీ ప్రభాకరరావునాయుడుగారు (గుంటూరు కలెక్టరుగారిభార్య) నర్సారావుపేటలో "రుక్మిణీ ప్రభాకర స్త్రీ విద్యాభివర్ధనీసమాజ" భవనమునకు శంకుస్థాపన మొనర్చిరి.

◆ ◆ ◆

మద్రాసు ప్రభుత్వంవారు గ్రుడ్డివారికి చదువు చెప్పను సేలంలో ఒకపాఠశాల, కడపలో ఒక పాఠశాల ఏర్పరుపబోతున్నారు.

◆ ◆ ◆

జలుబుకు మేలైనమందును అమెరికా సంయుక్త రాష్ట్రముల నౌకాదళవైద్య పరిశోధకశాఖవారు కనిపెట్టినారు. అది మాత్రలుగా ఉంటుంది. జలుబుగా ఉండగానే మ్రింగివేస్తే సరి.

◆ ◆ ◆

గతమాసాంతంలో అధికవర్షాలవల్ల, తుపానువల్ల గుంటూరు, కృష్ణా, నెల్లూరు గోదావరిజిల్లాలలోను కడప కర్నూలు జిల్లాలలోను చాలా ఇండ్లు పడిపోయినవి. పశువులు నష్టమైనవి. పైర్లు పాడైనవి. మనుష్యులు కూడా కొందరు చచ్చిపోయినారు. గుండ్లకమ్మ నదిపొంగి ఇనమనమెళ్లూరు, ధేనువకొండ, కొలచనకోట, చేరువనుప్పలపాడు మున్నగుగ్రామాలు బాగా దెబ్బతిన్నవి. పెన్నగట్టు మినగల్లువద్ద తెగినది. నెల్లూరి రంగనాయకుల గుడిలోనికి నీరువచ్చినది. కృష్ణవరదలు వచ్చినవి. అమ్మనబ్రోలువద్ద రైలువంతెన పడిపోయినందున రైలుబండ్లు నాలుగురోజులు నడువలేదు.




రాష్ట్రపతి డక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు - కాన్పూరులో గాంధీజయంత్యుత్సవములందు బహిరంగ సభలో ఇట్లని చెప్పినారు:—

5 సం||లలో హిందీ భారతదేశమందలి అన్ని ప్రాంతాలలో తెలిసిపోతుంది. దక్షిణభారత దేశంలో పురుషులకన్నా స్త్రీలే హిందీ నేర్వవలెనని హెచ్చు ఆత్రంగా ఉన్నారు.

మద్రాసు హైకోర్టుజడ్జి శ్రీ ఏ. యస్. పంచాపకేశయ్యర్‌గారు బిసెంటు జన్మదినోత్సవమునాడిట్లుపన్యసించారు:—

బిసెంటు నవ్యభారత దేశనిర్మాతయని చెప్పనొప్పును. ఆమె నేతృత్వము వహించి తన నిర్మాణ కౌశలముచే వేలకొలది మానవులను భారత స్వాతంత్ర్యమునకై కృషిచేయ పురిగొల్పినది. ఆమె ఈ దేశ ప్రజల ప్రేమించి, ఏవిధమగు తెల్లరంగు అహంకారము చూపక - దేశీయులయెడ సహనమువహించి - వారికి ప్రేమాస్పదురాలైనది. ఆమెయే ప్రప్రథమమున హరిజనుల నుద్ధరింప కృషిసల్పినది. తానే ఆదర్శముగా చరించి, భారతీయ స్త్రీలు గృహాంగణము వెలుపలను ప్రజాహితకరోద్యమముల పాల్గొనుటకు గొప్ప ప్రోత్సాహ మొసంగెను. ఆమె నూతన విద్యావిధానమునుగూడ నేర్పరచినది.

తిరువల్లిక్కేణియందలి నేషనల్ గరల్స్ హైస్కూలునందు "శ్రీమతి కాకమ్మాళ్ మ్యూసిక్‌హాలు" తెరుస్తు - శ్రీ సర్. సి. పి. రామస్వామి అయ్యరుగారు - స్త్రీ విద్యను గూర్చి ఇట్లుపన్యసించినారు:—

ప్రపంచమంతటా విద్యావంతులల్లా ఇట్లభిప్రాయపడుచున్నారు: అనేక విషయాల పురుషుల విద్య అంతస్థులోనే స్త్రీల విజ్ఞాన విద్యకూడా ఉండాలి. అయితే లోటుపాట్లు పూర్తిచేసేదిగా ఉండవలెను. ఉన్నదానికి తోడైయేదిగా ఉండవలెను.

యం. ఇ. జోన్సుగారు 2-10-49 హిందుపత్రికలో ఇట్లు వ్రాయుచున్నారు.

స్త్రీలు ఇప్పుడు - దేశముయొక్క కార్మిక రంగంలోకూడా పనిచేస్తున్నారు. కాబట్టి వారి దేహ దార్ఢ్యంకూడా ఇక ప్రాముఖ్యత వహిస్తున్నది. స్త్రీలు చురుకైనవారు. త్వరలో నేర్చుకోగలరు. ఇన్ని దినాల్లో ఇన్నిగంటలుపని చేయగల్గుటకు తమ విషయంలో తాము జాగ్రత్తపడవలెననే సంగతి గ్రహిస్తున్నారు. పలుమారు గైర్‌హాజరైతే దేశానికివచ్చే నష్టమునిన్ని వారు గ్రహిస్తున్నారు. తమ జీవితం సంపూర్ణంగా శోభాయమానంగావలెనంటే, తమ తీరిక కాలమును బాగా అనుభవించవలెనంటే, ఉపయుక్తమైన పౌరులుగా తాము వ్యవహరించవలెనంటే - తమ ఆరోగ్యం చక్కగా ఉండాలి అనికూడా గ్రహించారు.

# సంపాదకీయములు

## వరలక్ష్మమ్మగారి విజయం.

గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రథమ బహూకృత కవయిత్రి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు గుంటూరు జిల్లాబోర్డునకు కాంగ్రెసు తరపున అధికసంఖ్యాకులచే యెన్నుకొనబడి విజయముగాంచి నందులకు వారి కెంతయు అభినందిస్తున్నాము. కమ్యూనిస్టు, స్వతంత్రాభ్యర్థు రాంద్రకున్నూ ఆమెకున్నూ ఓట్లలో వచ్చిన తేడా గణనీయము. కాంగ్రెసు పలుకుబడితో ఆమెయందలి గౌరవమున్నూ ఈ తేడాకు తోడ్పడెనని తోచుచున్నది. వారిరువురిని ఓడించినమాత్రాన ఈమెకు సమభావమును, బీదసాదలందు సానుతాపమును సున్నయనిగాని, స్వతంత్ర భావమున లోపమనిగాని పరిగణింపరాదు. అయితే విపరీతము లొనర్చి, సంఘవ్యవస్థను బోర్లదోయకుండానే శాంతముగ చట్టరీత్యా పేదసాదల సేవించ వలయుననియు, సంఘనిర్మాణమొనర్ప దగుననియు ఆమె విశ్వాసమని మా అభిప్రాయము. ఆమె స్వతంత్రభావము ఒకరాజకీయ సంస్థకు కట్టుబడుట కభ్యంతరము కల్గించునది కాదనియు తెలియవలయును. పార్లమెంటరీ కార్యక్రమమువల్ల కాంగ్రెసునకు మచ్చ ఏర్పడుచున్నదేమోయన్న సంశయముదయించుచున్న ఇక్కాలమున ఇట్టినీతిపరులు ప్రతినిధులగుట శ్రేయస్కరము. ముఖ్యముగా విద్యావిహీనుల కాటపట్టగుచున్న స్థానిక పరిపాలనా సంఘములందు ఇట్టివిదుషీమణుల అవసరమెంతైనగలదు. శ్రీ వరలక్ష్మమ్మగారి సభ్యత్వ కాలము ఆదర్శప్రాయమైనదగునని ఆశింతుము.

## ఆంధ్రరాష్ట్రము.

కాంగ్రెసువర్కింగు కమిటీవారు తిరిగీ—జె. వి. పి. రిపోర్టు నంగీకరించుచు తీర్మానం చేశారు. అయితే మద్రాసును వదులుకోవడానికి ఆంధ్రదేశంలో కొంతప్రజాభిప్రాయం వ్యతిరేకమని వారు గమనింపకపోలేదు. కాబట్టి మద్రాసు వదులుకొని ఆంధ్రరాష్ట్రం 26.1.50 లోపల గవర్నర్ జనరల్ ఆర్డరు క్రింద పొందడమూ లేక పిదప చట్టంలో చెప్పబడ్డ సోపానములన్ని దాటి పొందడానికి యత్నించడమూ అన్న బాధ్యత ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ మీదనూ, ఆంధ్రశాసన సభ్యులమీదను, ఆంధ్ర మంత్రుల మీదనూ పెట్టినారు. ఈవిషయంలో జె. వి. పి కమిటీ సలహాను - వర్కింగు కమిటీయున్నూ, యూనియన్ ప్రభుత్వమున్నూ సమ్మతించినదని కూడా-వారుతెలుపడం గమనార్హం. అయితే ఇప్పుడు మద్రాసు మీద అపేక్షచే 26.1.50 లోపల రాష్ట్రసిద్ధి నిరాకరించడంలో ఆయావారిపై గొప్పబాధ్యత కలదు. అవతల రాష్ట్రమును సంపాదించడానికి అవకాశమిచ్చే కాలపరిమితిని ఎవరైనా ఊహించగలరా? అప్పటికన్నా, ఎప్పటికన్నా మద్రాసు కూడా మనకు దక్కుతుందనడానికి ఆధారాలేమైనా ఉన్నవా? ఆశలేమైనా కన్పిస్తున్నవా? అనే విషయాలుకూడా గమనించదగును. కాంగ్రెసు వర్కింగు కమిటీగాని, యూనియన్ ప్రభుత్వంగాని మద్రాసు

# సంపాదకీయములు

గృహలక్ష్మి

సహేమనకు ఆంధ్రరాష్ట్రమునిచ్చి - తత్ఫలితములను ఎదుర్కొనడానికి మాకిప్పుడు అవకాశములేదంటే మనము వారితో తగవులాడజాలము. వారిది రజ్జు సర్పభ్రాంతియే కావచ్చు. అనేకబాధ్యతల తలనెత్తుకున్న వారన్న సంగతిన్ని, మద్రాసు విషయమై మనకన్న అర్తము వారికుండజాలదన్న విషయమున్ను మనము గుర్తించవలె. ఇంతకూ, బెజవాడలో జరిగిన పరిమిత ప్రాతినిధ్యముగల పరిషత్తు వారి అభిప్రాయమే ప్రజాభిప్రాయము అని ప్రకటిత మగుచున్నప్పుడు తద్వ్యతిరేకాభిప్రాయముగలవారు పైమువ్వురకు తమ అభిప్రాయమును స్పష్టపరుప వలయును. ఆంధ్రుల కెంత హక్కున్నను తమిళుల అనుభవములో యున్న మద్రాసు మనకు దక్కుట చాల దుస్సాధ్యమనియు, ఈనాటికి ఈనాటికి మీ రాంధ్రరాష్ట్రమును బడయవచ్చని మాట, దానిని చట్టరీత్యా అమలు పరుపగల వారివల్ల పుట్టినప్పుడు ఈ సదవకాశమును విడుచుట 36 సం॥ల నుండి అందుకై తపించుచున్న ఆంధ్రుల కుచితముగాదనియు, అవసరముకొలది జె. వి. పి. కమిటీ వారు నంగీకరించి రాష్ట్రమును వెంటనే బడయుటయే వివేకమనియు మా అభిప్రాయము. అయితే మద్రాసుననూ ఈచుట్టుప్రక్కలనుగల ఆంధ్రుల బాగోగులు సంరక్షించుట మాత్రము ఆంధ్రుల కర్తవ్యము. దానిని రాష్ట్రవిరహితులగు ఆంధ్రులకన్నను, రాష్ట్రసహితులగు ఆంధ్రులు నెరవేర్పగలరనియు మా విశ్వాసము.

## యూనియర్ పార్లమెంటు, ఎన్నికలు

26-1-50 నాడు నూతన రిపబ్లిక్ రాజ్యాంగచట్టం అమలులోకి వస్తుంది అంటున్నారు. అప్పుడు కాన్స్టిట్యుయంట్ అస్సెంబ్లి రద్దైపోతుంది. కాని ఆ సభ్యులు - యూనియన్ పార్లమెంటు తాత్కాలిక సభ్యులుగా క్రొత్త యెన్నికలు వచ్చువరకు ఉండిపోతారు. అయితే కొందరు సభ్యులు - రాష్ట్రసభల లోను ఇందులోనూకూడా ప్రతినిధులుగా ఉన్నారు. అట్టివారికి రాష్ట్రసభ్యత్వమే ఖాయము. వారి సభ్యత్వం వదులుకోవలయును. ఆ స్థానముల కితరులను ఎన్నుకోవలెను అని - కాన్స్టిట్యుయంట్ అస్సెంబ్లీ వారు తీర్మానించారు. ఆ విషయం చర్చ జరిగేటప్పుడు శ్రీమతి పూర్ణిమాబానర్జీ గారు - కాళీబడ్డ స్త్రీ సభ్యత్వాలకు స్త్రీలే ఎన్నుకోబడాలి అని సవరణ బెట్టారు. ఈ సవరణ చాలా క్లుప్తమైనది, సబబైనది. ఆమె చెప్పిన ఉదాహరణలుగూడా గమనార్హము. ఇదివరలో సరోజినిదేవి, విజయలక్ష్మి పండిట్, మాలతీ చౌదరీగార్ల సీట్లు కాళీపడితే, వాటికి పోటు పేరంటాండ్రే పద్దుకున్నారన్నది. అయితే ఈమె చాలా మెదకుర లు. ఆమె సవరణ చాలా పలచనైనది. ప్రస్తుతం దేశంమొత్తంమీద 100 కి పైగా కాళీ లేర్పడ్డవట. బానర్జీగారన్నట్లు పోలీసురాజ్యముకాదు జరిగేది; సాంఘిక సేవారాజ్యము. సంఘంలో స్త్రీ సమాన బాధ్యురాలు. సగంమంది సభ్యులైనా స్త్రీలుండదగును. ఈ సూత్రంనికూడా - స్త్రీలనే ఏల ఎన్నుకోరాదు? వారిలో కొందరు ముస్లిములు కావచ్చు; హరిజనులుగావచ్చు; సిఖులు కావచ్చు. మేము వినడంలో మనరాష్ట్రమునుంచీవెళ్లిన చాలమంది మగధీరులకన్నా మన దుర్గాబాయమ్మగారు రాజ్యాంగచట్ట నిర్మాణసభలో ఎంతో సామర్థ్యంతోను శ్రద్ధతోను-చట్టనిర్మాణాని కనేక విధాలతోడ్పడి పెద్దలమన్ననల బడయగలిగారట. వివేకంతోపాటు కష్టించి కృషిచేయడంగూడా ఆమెకు కలదని వింటాము. అట్లామరి డజనుమంది ఆ సభలో ఉంటే - చట్టములింకా ఎంతో చాకచక్యంతో జరుగుతాయి. కాబట్టి కనీసం మనరాష్ట్రంనుంచైనా - కాళీబడ్డ 19 సీట్లకు - సగంమందినన్నా స్త్రీలను ఎన్నుకోవలసినదని కోరుతున్నాము.




వత్సరాజు: శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు. దొరుకుచోటు: ఎమ్. ఎస్. ఆర్. మూర్తి అండుకో. విశాఖపట్నం. వెల రు 2-0-0.

కాళిదాసుకన్న పూర్వుడైన సంస్కృతనాటకకర్త భాసమహాకవికృతమగు 'ప్రతిజ్ఞా యౌగంధరాయణమునకు—"భాసిలజేసి తాంధ్రమున ప్రౌఢవచస్సుల రుక్మిణమ్మనే"—అని ఈకవయిత్రి నాటకాంతమున వ్రాసియున్నది. శ్రీమతి రుక్మిణమ్మగారి రచనలకు మాపాఠకులు చిరపరిచితులు. మృదుమధుర లలితకవిత్వము. పదగుంభన మామెసొమ్ము. మూలమునకు మక్కికిమక్కిగా భాషాంతరీకరింపకుండ రసముట్టిపడ స్వేచ్ఛానువాదమొనర్చితినని శ్రీరుక్మిణమ్మగారనుచున్నారు. నేడు ఆంధ్రనారీమణులు పలువురు విద్యావతులై పలు రచన లొనర్చుచున్నారుగాని ఇట్టికావ్యనాటకముల రచించుటకు దొరకొనుచున్నవారు చాలకొలది. శ్రీ రుక్మిణమ్మగారిట్లే శాశ్వతప్రయోజనముగల ఉద్గ్రంధములను పెక్కింటిని వ్రాయుదురని కోరుచున్నాము.

యోగసిద్ధి: రచయిత: గవరవరం రామస్వామికవిగారు. ప్రకాశకులు: అన్బు నిలయం రామచంద్రపురంపోస్టు, తిరుచనాపల్లిజిల్లా. వెల రు 1-8-0.

తమిళులైన శ్రీయోగి శుద్ధానందభారతి స్వాములవారు "బహుముఖమైన ఆధ్యాత్మికజీవితమునుండి గ్రహించిన రహస్యములను సూత్రప్రాయముగ వ్యక్తీకరించుచు" తమిళభాషయందు "యోగసిద్ధి"—అను నొక గ్రంథమును రచించిరి. ఆ "సూత్రములను ఆంధ్ర సోదర సోదరీమణుల కందజేయుటకై" విళుప్పుర వాస్తవ్యులగు కవిశేఖర శ్రీ గవరవర రామస్వామికవిగారు తెనుగున నీపద్యకావ్యరూపమున దాని ననువదించిరి. విళుప్పుర వాస్తవ్యులనగా ద్రావిడదేశస్థులైన ఆంధ్రులు. ద్రావిడదేశమున తెలుగువారికి తెలుగుబాస చెప్పుటలేదని—రాజకీయనాయకులు గోలబెట్టుచున్నారు. అయిన నీ కవిశేఖరుడు.

"ద్రావిడవని జన్మికి నాంధ్రకవిత లలవడుట లెట్లునాగ తలంతురైన
పాకనాటనియోగి సద్వంశకీర్తినా దలంచుడు కవులు గణ్యంపుమదుల॥"

అని సగర్వముగా చెప్పుకొన్నాడు. భారతమురచించిన తిక్కనవంశీయులు నేడు "పాకనాటి నియోగులము" అని చెప్పుకొందురు. కవిసార్వభౌమ శ్రీనాథమహాకవి "పాకనాటింటివాడ"నని చెప్పుకొన్నాడు. కావున నీకవి కీగర్వంబుజెల్లు. ఈకవి ఇంతకు

"మును శ్రీ వివేకచూడామణి భగవద్గీత మోక్షమార్గ రహస్యం
బును శోణశైలమహిమయు తెనుగున వృద్ధాద్రికతల తెల్పితికతలఁ."

అని తెల్పుకొనియున్నాడు. ద్రావిడదేశ మధ్యవాసియయ్యు—మాతృభాషాసేవ చేసిన ఈ ఆంధ్రసోదరుని గ్రంథమును—ఆంధ్రదేశవాసులైన తెలుగువారెల్ల రాదరించి, నిత్యము రాష్ట్రేతరాంధ్రుల దుస్థితినిగూర్చి కంటికి కడివెడుగా దుఃఖించు తమ అభిమానమును కార్యరూపమున చూపుదురని ఆశించెదము. వీరిశైలి చూపుటకు పైనుదహరించిన పద్యములేచాలును.

## స్వీకారము



**తిరుగుబాటు వాదులు పురోగమించాలి : ముదివర్తి సత్యనారాయణగారు, లాల్ బుక్ డిపో. గవర్నరుపేట. బెజవాడ. వెల రు 0-3 0.**

1942 ఉద్యమం మందగించడం ప్రారంభింపగానే - జయప్రకాశ్ నారాయణ్ నాయకత్వాన సోషలిస్టులు - దీనిని విప్లవోద్యమంగా నడపాలని ప్రయత్నించారు. అందుకుతగిన గ్రంథసామగ్రి రచించి ప్రచారంచేశారు. అలాంటి గ్రంథాలలో ఇదియొకటి. రామమనోహరలోహియా అనే సోషలిస్టు మూలము నాంగ్లంలో రచించగా - వంగోలు బాంబుకేసులో ముద్దాయిగా పేర్కొనబడి చిరకాలం పరారిలోయుండి పిదప కేసురద్దుకాగా బహిర్గతులైన - శ్రీ ముదివర్తి సత్యనారాయణగారదేయువకులు - తెలుగులోనికి అనువాదంచేశారు. అప్పటి వారివాదం తెలియ నిప్పుడు పనికివస్తుందే గాని పోరాటభాగం నేడు ఏమాత్రము అన్వయించదు. అయినా చరిత్రగా చదువదగినదీ గ్రంథము. అనువాదకులు వ్రాసిన ఉపోద్ఘాతము కొంత కటువుగా ఉన్నది. అంత కటువైనభాష ఉపయోగించకుండానే - తన వాదమును ఆయన బలపరచుకో వచ్చు. బహుశా ఆయన నేటి ప్రభుత్వంలో - ఫిర్కా డెవలప్మెంటు ఆఫీసరు ఉద్యోగం స్వీకరించక ముందు - ఈ ఉపోద్ఘాతం వ్రాసిఉంటారేమో.

**అష్టావక్ర చరిత్రము : శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారు. రామారావుపేట, కాకినాడ. వెల రు. 1-8-0**

శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు వ్రాసిన పద్యకావ్యమిది. ఇదివరకు రెండుకూర్పులైనవి. ఇది మూడవకూర్పు. వెనుకటికూర్పున దీనిని విమర్శించి యున్నాము. దీనిని ఆంధ్ర మద్రాసు విశ్వవిద్యాలయములవారు పాఠ్యగ్రంథముగా స్వీకరించుటచేతనేగాక కావ్యపాశస్త్యమువలనను నిది 5 సం॥ లలో మూడవ ముద్రణము గాంచినది. ఇట్టి మర్యాద తరుచుగా ఆంధ్ర గ్రంథములకరుదు.

**శ్రీమహర్షి జీవిత కథామృతము : ప్రథమభాగము. శ్రీ బులుసు వేంకటేశ్వరులు గారు. రామారావుపేట, కాకినాడ, వెల రు 2 0 0 లు.**

ఇదియు పూర్వము విమర్శితము. ఇప్పుడు రెండవ ముద్రణము గాంచినది. ఇది వచనమే.

---

## చిత్రజగత్తు

"జెమినీ స్టుడియోస్"—వారు ఇదివరలో సినిమా లోకానికి "చంద్రలేఖ"ను ప్రసాదించి ప్రపంచమంతటా ప్రశంసల నూరగొన్నారు. ఆ కీర్తి మొగకెక్కేట్లు నేడు "అపూర్వ సహోదరులు" అనే చిత్రం తయారుచేసి వెండితెరపై చూపబోతున్నారు.

ఇందలిగాథ అలెగ్జాండర్ డ్యూమాస్ అనే సుప్రసిద్ధ రచనలలో నుజ్జ్వలమైనకథ. ఈ అక్టోబరు నెలమధ్యమందు దీపావళి యుత్సవములలో దేశమంతటా ప్రదర్శింపబడి వెండితెరకు వెలుగు చేకూర్చ నున్నది. ఈ చిత్రం తీయడంలో అన్ని అవస్థలలోకూడా చిత్రానికి పొందిక, మెరుగుతేవడానికి ఎంతో తంటాలు పడవలసినది. అందులో "జెమినీ" వారిది అందెవేసిన చేయికదా. సినిమా ద్రష్టలకు హృదయానందము కలిగించడమే జెమినీవారి ముఖ్యోద్దేశము.

ఈ కవలసోదరుల గాథలో, అధికారం, కామం, క్రోధం, మోహం, పెనవేసుకొని నడుస్తవి. అందుచేత ఈ చిత్రం, భారత చిత్రాలలో నూతనశోభ కల్గించేది.

మచ్చలేని, కళారహస్య జ్ఞానము, అతిత్వరితగతి నుద్రేకమును పెంపొందిన నైపుణ్యము, మనస్సు ఝల్లుమనిపించే నృత్యవిశేషములు, మనోహరమగు పాటలు, గుండెలు చిక్కబట్టే పోరాటాలు, ఊహాతీతమైన భావకుశలత ఇవన్నీ "అపూర్వసోదరుల"ను అపూర్వ చిత్రాన్ని గావించి శబాస్ "చంద్రలేఖ"ను తగినట్లనుసరించిందిరా అనిపించినవి.



## శ్రీ విరోధినామ సం॥ర ఆశ్వయుజ కార్తిక మాసములు.

అక్టోబరు

1949 నవం॥

నవంబరు

| | | |
|---|---|---|
| 16 | ఆ | న 22-21 పుష్య 20-16 సా 22-6 నవమీ తిథి. |
| 17 | సో | ద 18-40 ఆశ్లే 18-23 రావి 19.53 తిథి ద్వయం యమకంటక యోగం. |
| 18 | మం | ఏ 14-12 మ 19.39 రావి 5-25 ద్వాదశీ తిథిః సర్వేషా మేకాదశీ. |
| 19 | బు | ద్వా 9.3 పూఫ 12-15 రావి 0-2. [ మాస శివరాత్రి. |
| 20 | గు | త్ర 3.26 చతుర్దశి 54.4 ప్రేత చతుర్దశి, యమతర్పణం, నరక చతుర్థి స్నానం, |
| 21 | శు | ● 51-22 హ 4.15 వై 15-25 దీపావళి అమావాస్య. |
| 22 | | |
| 23 | | కార్తిక మాసము. |
| 24 | శ | పాడ్యమి 45.34 చి 0-3 స్వా 55-58 స్వాత్యభ్యంగన స్నానం |
| 25 | ఆ | ది 40-0 విశా 52-20 దివి 9.1 యమద్వితీయా; భగినీహస్త భోజనం. |
| 26 | సో | త 34-58 అనూ 49-13 దివి 1-49 |
| 27 | మం | చ 30-37 జ్యే 46 49 దివి 2-39 వృశ్చికాయనం. |
| 28 | బు | షం 27.9 మూ 45 41 అతి 33-39 నాగ పంచమి. |
| 29 | గు | ష 24-40 పూషా 44-54 దివి 9-22 దగ్ధయోగః. |
| 30 | శు | స 23.25 ఉ. షా. 45.37 ధృతి 25-0 రావి 27.15. |
| 31 | శ | అ 23-24 శ్ర 47.37 రావి 29-29 అష్టమీ తిథిః. గోష్టాష్టమీ. |
| | ఆ | న 24-40 ధ 50-48 శేషః 2-22 |
| | సో | ద 27-12 శ 55-11 దివి 10.10. |
| 1 | మం | ఏ 30 53 పూభా 60-0 బోధైకాదశి భీష్మపంచకవ్రతం. |
| 2 | బు | ద్వా 35-24 పూభా 0 35 వ్యా 15-59 క్షీరాబ్ధి ద్వాదశి. |
| 3 | గు. | త్ర 40.33 ఉభా రావి 11-24. |
| 4 | శు | చతు 45-54 రే 13-12 వైకుంఠ చతుర్దశి. |
| 5 | శ | ○ పౌ 50.56 అశ్వి 19-39 ది 8-34 రా 17.34. |
| 6 | ఆ | బ పాడ్యమి 55-22 భ 25-37 రావి 29-47. |
| 7 | సో | ది 58-48 కృ 30-49 చాతుర్మాస్యద్వితీయ. |
| 8 | మం | త 60-0 రో 34.59 రావి 21-19. |
| 9 | బు | త 1-6 మృ 37-57 రావి 31-14 దగ్ధయోగః. |
| 10 | గు | చ 2-9 ఆర్ద్ర 39-40 సిద్ధ 20-40 రంధ్రయోగః. |
| 11 | శు | పం 1-51 పు 40-9 దివి 9-54 రావి 31-43. |
| 12 | శ | ష 0-22 సప్తమి 57-21 పుష్య 39-30. |
| 13 | ఆ | అ 54-4 ఆశ్లే 37-49 ఇంద్ర సావర్ణిక మన్వాదిః. అనధ్యాయం. |
| 14 | సో | న 49-30 మ 35-15 దివి 6-32. |
| 15 | మం | ద 44-33 పూఫ 31-59 రావి 20-43. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd,
5, Westcott Road Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

కొలది ప్రతులుమాత్రమే కలవు — త్వరపడుడు

# బిల్వ, వేప

బిల్వ, వేప అను జాతీయమూలికలనుగూర్చి శాస్త్రవిషయక పరిశ్రమచేసి వ్రాయబడిన ఉత్తమ గ్రంథరాజములు. ఈ మూలికల ఓషధిగుణము, వైద్యప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణ వివరము, సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు, భక్తులకు మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథములు. క్రౌను సైజున మంచి ఫెదరువైటు కాగితములమీద ముద్రింపబడి గృహలక్ష్మి గ్రంథమాలలో ద్వితీయ తృతీయ కుసుమములుగా ప్రచురింపబడినవి.

గ్రంథకర్త : కె. యన్. కేసరి — ప్రతి 1-కి 0-12-0

గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట :: మద్రాసు

# ఏజంట్లు కావలయును.

"గృహలక్ష్మి" మాసపత్రికలు విక్రయించుటకు - చందాదార్లను చేర్పించుటకు ఈ దిగువ స్థలములలో ఏజంట్లు కావలయును.

సోంపేట; పాలకొండ; బొబ్బిలి; సాలూరు; కందుకూరు; నంద్యాల; గిద్దలూరు; అనకాపల్లి; కంభం; నర్సారావుపేట; పాలకొల్లు; అమలాపురం; జగ్గియ్యపేట; రాజోలు; ఆముదాలవలస; కైకలూరు; గునుపూరు; మండపేట; ధర్మవరం; సూళ్లూరుపేట; గూడూరు; బుచ్చిరెడ్డిపాళెం; కోట, వేటపాలెము; చేబ్రోలు; సామర్లకోట; పెద్దాపురము; కొల్లూరు; భట్టిప్రోలు; రేపల్లి; కాళహస్తి; తుని; వెంకటగిరి; పాకాల; ద్రోణాచలము; హాలాస్‌పేట; జబ్బల్‌పూరు; ఖమ్మంమెట్టు; వరంగల్లు; మహబూబాబాద్; మంతపేట; పోలవరం; తాడిపత్రి; ప్రొద్దటూరు; చిత్తూరు; ఆకీడు; వసంతవాడ; ద్రోణాచలము; నిడదవోలు; ఎలమంచిలి; గుడివాడ; వంగోలు; పొన్నూరు; నర్సీపట్నం.

వివరములకు :

## 'గృహలక్ష్మి' కార్యాలయము,

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14.

